



## సంపాదక వర్గం

సంపాదకుడు :
లయన్ కె.వి. గోవిందరావు,
బి.ఎ., ఎల్ ఎల్.బి.

గౌరవ సహాయ సంపాదకులు :
బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు,
ఎమ్.ఏ., విద్వాన్
వి. బాలకుమార్, ఎమ్.ఏ., బి.ఎల్

సభ్యులు :
కె.వి.ఎస్. గోవిందరావు,
బి.ఎ., ఎల్ ఎల్.బి
కె.వి.ఎస్ శరత్ బాబు,
బి ఎ., బి కామ్., బి ఎల్
కె.వి.ఎస్. విజయకుమార్
కె రత్నకుమారి


## చందా వివరాలు

| | |
|---|---|
| శాశ్వత చందా | 1,000.00 |
| జీవిత చందా | 250.00 |
| 3 సంవత్సరాలకు | 52.00 |
| సంవత్సర చందా | 18.00 |
| ఎయిర్ మెయిల్ (1 సంవత్సరం) | 80.00 |
| సీ మెయిల్ (1 సంవత్సరం) | 45.00 |


చందాలు పంపవలసిన చిరునామా :

విజ్డమ్
9, దేశికా రోడ్డు, మైలాపూరు,
మద్రాసు-600 004


# ఈ సంచికలో

ఏప్రిల్ 1984



★

ముఖచిత్రం-కలర్ ట్రాన్స్‌పరెన్సీ:
శ్రీ పి. వి. సుబ్రహ్మణ్యం, తిరుచిరాపల్లి.

★

తెలుగు 'విజ్డమ్'కు ఇది మూడవ సంవత్సరం

## ధ్యానం

### 'మంచి' ని 'చెడు' ఎన్నడూ జయించ లేదు!



జేమ్స్ ఎలెన్

మంచి వాడికి దాపరికం అంటూ ఉండదు. ఇతరులు ఎరుగరాని ఆలోచనలు గాని, కోరికలు గాని అతనికి ఉండవు. అతడు నిర్భయుడు; దేనికీ సిగ్గుపడడు. దృఢంగా అడుగు ముందుకు వేస్తాడు; తల ఎత్తుకొని నడుస్తాడు. మాట అసందిగ్ధంగా సూటిగా ఉంటుంది. ఎదుటి వాని కళ్లల్లోకి చూసి మాట్లాడుతాడు. ఎవరికీ హాని చేయని వాడు ఎందుకు భయపడతాడు? ఎవరినీ మోసగించనివాడు ఎందుకు సిగ్గుపడతాడు? 'చెడు' చెయ్యని వానికి ఎవ్వరూ 'చె రు పు' చెయ్యలేరు. 'మోసం' ఎరుగని వానిని ఎవ్వరూ మోసగించ లేరు. 'మంచి'ని 'చెడు' జయించ గలగడం కల్ల!

## సంపాదకుని పేజీ

### ఆరోగ్యానికి నడక అవసరం!



నానాటికీ నడక అలవాటుకు మనం దూరం అవుతున్నాం; చక్రాల కోసం, శకటాల కోసం అర్రులు చాస్తున్నాం. ఒక బస్సు స్టాప్ నుంచి మరో బస్ స్టాప్ కూడా మన కళ్ళకు ఎంతో దూరంగా ఉన్నట్టు కనిపిస్తూంది. పర్యవసానంగా - దృఢంగా ఉన్న స్త్రీలూ, పురుషులూ, పిల్లలూ కూడా బస్ స్టాప్‌లలో బస్సుల కోసం పడగాపులు పడి ఎదురు చూస్తూ తమ కాలాన్నీ, డబ్బునూ, ఓర్పునూ వృథా చేస్తూ ఉండడం నిత్యం మనం చూస్తున్నాం. ఆధునిక సుఖ జీవన సాధనాలు మనిషిని యంత్రంగా మార్చి, ప్రతి దానికీ యంత్రం మీద ఆధారపడే బానిసను చేశాయి.

"వెనుక మనిషి సగటున రోజుకు 20 మైళ్ళు దూరం నడిచేవాడు: నేడు మనిషి

"ఏ మనిషి ముఖం ఆ మనిషిదే!" —చార్లెస్ షుల్జ్

రోజుకి సగటున 2 మైళ్ళు మాత్రమే నడుస్తున్నాడు" అంటారు సుప్రసిద్ధ మానవ శాస్త్రవేత్త (anthropologist) రాబర్ట్ బ్రిఫాల్ట్.

నగరాలలో 'నడక' మరీ వెనుకబడుతూంది. నడవడం పేదరికానికి చిహ్నం అనే భావం ప్రబలింది. మనిషికి నడక సహజమైన వ్యాయామం అయినా, ఆధునిక మానవుడు దానిని నిర్లక్ష్యం చేస్తున్నాడు. "నాగరక మానవుడు శకటాలు కనిపెట్టాడు; కాళ్ళ ఉపయోగం కోల్పోయాడు!" అన్నారు ఎమర్సన్. ఇదే పద్ధతి కొనసాగితే మానవుడికి ఒకప్పుడు తోక రాలిపోయినట్టే, క్రమంగా పాదాలు కూడా నశించడం జరుగవచ్చు!

ఈ రోజులలో అత్యవసరం అయితే తప్ప మనుష్యులు నడవడం మానేశారు. ప్రపంచంలో కొన్ని నగరాలలో కార్లలోనే లోపలికి వెళ్ళేందుకు వీలైన 'డ్రైవ్ - ఇన్' చర్చిలూ, సినీమాలూ, పోస్టాఫీసులూ, బ్యాంకులూ వెలిశాయి. మరికొన్ని నగరాలలో ట్రాఫిక్ నియమాలను ఉల్లంఘించిన వ్యక్తి తన కారులో నుంచి దిగనక్కర్లేకుండానే 'సంచార కోర్టు'లలో ఫైన్ చెల్లించే సదుపాయం ఏర్పడింది.

బలాన్నీ, సహనాన్నీ, ఆరోగ్యాన్నీ సూచించేది 'నడక'. ఉరుకులూ, పరుగులతో సాగే మన దైనిక జీవితంలో వ్యాయామానికి ఎలాగూ అవకాశం లేదు; కనీసం నడక వల్ల అయినా మనం మన ఆరోగ్యాన్ని కాపాడుకోవాలి!

నడకలో ఉన్న ఆనందాన్ని గురించి చెప్పిన వాడు హెన్రీ థోరో. నడుస్తూ ఉంటే

## బొమ్మలలో హాస్యం

### టీ.వీ. వార్తలపట్ల నమ్మకం!




చెట్లూ, పువ్వులూ, కీటకాలూ, పక్షులూ, జంతువులూ అన్నీ మనకు కనిపిస్తాయి. ప్రతి మలుపూ మనం గమనిస్తాం. ఎదురుగా వచ్చే వారిని పలుకరిస్తూ పరిసరాల స్వభావాన్ని గ్రహిస్తాం. కారులో వెళుతూ ఉంటే ఈ విధంగా ప్రకృతిని పరామర్శించడం సాధ్యం కాదు. ప్రకృతి ఒడిలో ఉన్నామనే భావన మనకు కలుగదు. శీఘ్ర గమనం జీవితంలో అవసరమే కావచ్చు; కాని అదే జీవిత విధానం కాకూడదు.

గౌతమ బుద్ధుడు మగధ దేశం (నేటి బీహారు) అంతటా కాలి నడకనే పర్యటించాడు. కొండలూ, గుట్టలూ, నదులూ, వాగులూ గడుస్తూ మానవులకు ఆశ్వాసం కలిగించే తన నూతన సందేశం వినిపించాడు. శిష్యులూ, భక్తులూ ఆయనను భుజాల మీద

"ప్రార్థనకంటె ముఖ్యమైనది హృదయం; హృదయం లేనప్పుడు మాటలకు అర్థం ఉండదు!" —గాంధీజీ

మోయలేదు. కాలి నడకనే ఆయన ప్రయాణించాడు. ఏసుక్రీస్తు కూడా 'జూడియా', 'గెలిలీ'లలో కాలి నడకనే పోయి మానవ జాతికి తన విమోచన సందేశాన్ని అందజేశాడు. దేవుణ్ణి కలుసుకోడానికి కాలినడకనే 'సినాయ్' కొండ మీదికి వెళ్ళి దేవు డిచ్చిన 'పది ఆదేశాల' (Ten Commandments) తో కాలి నడకనే మోసెస్ తిరిగి వచ్చాడు.

కొండలూ, అడవులూ, ఏకాంత వాసానికీ, అద్భుత సృష్టి రహస్యాలకూ స్థావరాలుగా ప్రసిద్ధి పొందాయి. అనాది కాలం నుంచీ తపస్సు చేయడానికీ, దేవుణ్ణి సందర్శించడానికీ కొండలకూ, అడవులకూ పోయేవారు. యంత్రాల సాయం లేకుండా వినమ్రంగా కేవలం పాదాచారులుగానే వెళ్ళేవారు.

ఇద్దరు కలిసి నడుస్తూ ఉంటే వారి శరీరాల కదలికలలో, మనస్సుల ఆలోచనలలో ఒక లయ కనిపిస్తుంది. ఒంటరిగా నడుస్తూంటే ఆత్మవిచారణ ఆరంభం అవుతుంది.

ఒక ప్రముఖ వ్యక్తి కారులోనో, విమానంలోనో ఎక్కడికైనా వెళితే అది ప్రత్యేకంగా ఘనంగా చెప్పుకోరు. అదే కాలి నడకను పర్యటిస్తే పత్రికలలో పతాక శీర్షికలలో ప్రచురిస్తారు. వినోబా భావే ఇండియా అంతటా వేలాది మైళ్ళ దూరం పాదయాత్రకు పూనుకున్నప్పుడు పత్రిక లన్నీ ఆ యాత్రా విశేషాలను ప్రముఖంగా ప్రకటించాయి. ఒలింపిక్ పోటీలలో సువర్ణ పతకం అందుకున్న డోనాల్డ్ థాంప్సన్ లండన్ నుంచి బ్రైటన్‌కు ఏటా జరిపే నడక పోటీలో ప్రథముడుగా వచ్చినప్పుడు అతనిని పూల దండలతో నింపివేశారు.

తమ గృహ కృత్యాలు నిర్వర్తించడంలో పురుషుల కంటె స్త్రీలు రోజూ ఎక్కువ దూరం నడుస్తారని చెప్పవచ్చును. ఇంటి పనులలో ఇల్లాలు నిత్యం తేలికగా 4, 5 మైళ్ళ దూరం నడుస్తుంది. కొట్లో పని చేసే సేల్స్ గర్ల్ రోజూ సుమారు 17 మైళ్ళ దూరం నడుస్తుంది. ఆసుపత్రిలోని నర్సులు రోజూ దాదాపు 12 మైళ్ళు నడుస్తారు. ఇలా నడిచే నడకలో

(మిగతా 61వ పేజీలో)

# 30,000 ఏళ్ళ నాటి మనిషి



పూనెలో దక్కన్ కాలేజీకి చెందిన ఒక పరిశోధక బృందం వారు మరాట్వాడా ప్రాంతంలో మంజీరా నది లోయలో ఏనుగులు, గుర్రాలు, మొసళ్ళు మొదలైన వాటి శిలాస్థులతో సహా ఎన్నో అపూర్వమైన పురాతన వస్తు నిక్షేపాలను తాము కనుగొన్నట్లు చెబుతున్నారు. ఆదిమ మానవుడు 30,000 ఏళ్ళ క్రితమే ఆ ప్రాంతంలో జీవించి ఉన్నట్లు అవి సాక్ష్యం చెబుతున్నా యట!

"సంసార సౌఖ్యం ఉంటే ఎన్ని
కష్టాలు వచ్చినా ఎదుర్కోవచ్చు!" —హెచ్. ఏ. ఫాన్ కేసర్లింగ్

## ప్రసిద్ధ భారతీయ కవులు

# మహాకవి వాల్మీకి

డా. మను జి. భగత్

సంస్కృతంలోనే కాదు, ప్రపంచంలోనే ఆది కావ్యంగా పరిగణించ బడుతున్న శ్రీమ ద్రామాయణ కావ్యం రచించిన మహర్షి వాల్మీకి. హోమర్, షేక్స్పియర్, డాంటే వంటి అగ్రశ్రేణికి చెందిన ప్రపంచ కవి పరంపరకు ఆద్యుడు ఆయన. తర తరాలుగా భారత దేశంలోని వివిధ భాషల కవులనే కాక, భారతీయ సంస్కృతి ప్రసరించిన అన్ని దేశాల కవులనూ కూడా వాల్మీకి మహాకవి ప్రభావితం చేస్తూ వచ్చాడు.



వాల్మీకి

రామాయణ కావ్య కథానాయకుడు అయోధ్య ప్రభువైన శ్రీరామ చంద్రునికి సమకాలికుడు వాల్మీకి. 24,000 శ్లోకాలతో కూడిన వాల్మీకి రామాయణం తర తరాలుగా హిందువులకు ఉదాత్తమైన భావనలను, ధర్మానురక్తిని, సత్ప్రవర్తనను అలవరుస్తూంది. వాల్మీకి అంత నిపుణుడైన కథకుడు లేడు. వందల సార్లు విన్నా ఎప్పటి కప్పుడు మళ్ళీ ఆసక్తితో వినేట్టు కథ చెప్పగలడు ఆయన. సంస్కృత రామాయణాన్ని కాక పోతే ప్రాంతీయ భాషల లోకి అనువదించిన రామాయణాన్ని అయినా వందలాది స్త్రీ పురుషులకు తిరిగి తిరిగి విని పిస్తూ ఉండని పల్లెటూరు ఒక్కటికూడా ఇండియా లో కనిపించదు. తల్లులు ఈ దేశంలో తమ పిల్లలకు చనుబాలతో రామాయణ కథను రంగరించి పోసి పెంచుతున్నారంటే అతిశయోక్తి లేదు.

మహాకావ్యం వ్రాయడానికి అనుగుణమైన 'అనుష్టుప్' అనే ఒక గొప్ప ఛందస్సును వాల్మీకి దర్శించాడు. రామాయణ కావ్యావతరణకు సంబంధించిన కథ ఒకటి ఉంది. ఒక రోజు ఉదయం స్నానం చేసేందుకు

---

"స్వయంగా సృష్టించని సుఖాన్ని గాని,
సంపదను గాని అనుభవించే హక్కు నీకు లేదు." — బెర్నార్డ్ షా

తమసానదీ తీరానికి వెళుతూ ఉండగా ప్రక్కన చెట్టుమీద క్రౌంచ పక్షుల జంట ఒకటి కామ క్రీడలో విహరిస్తూ వాల్మీకికి కనిపించింది. అంతలో ఎక్కడినుంచో రివ్వున ఒక బాణం వచ్చి మగపిట్టను నేలకూల్చింది. భర్త శవం చుట్టూ తిరుగుతూ ఆడపిట్ట విలపిస్తూంది. కరుణ పొంగి వచ్చి అప్రయత్నంగా వాల్మీకి నోట ఒక శ్లోకం వెలువడింది. "ఒరే నిషాదుడా! కామ మోహితమైన ఈ జంటను ఎడబాపిన నీకు ఎక్కడా నిలుకడ చిక్కదు సుమా!" అని. ఆ బోయవానికి ఆయన ఇచ్చిన శాపం అది. ఆలా వెలువడిన తన మాటలు ఛందోబద్ధంగా ఉండడం చూసి ఆయన ఆశ్చర్యపోయాడు. ధ్యాన నిమగ్నుడయాడు. ఆ ధ్యానంలో బ్రహ్మదేవుడు కనిపించి "నీ శోకం నీ నోట శ్లోకంగా వచ్చింది. ఈ ఛందస్సులోనే నీవు రామాయణ మహా కావ్యం వ్రాయాలి" అంటూ రామాయణ కథా విశేషాలన్నీ విస్పష్టంగా ఆయనకు స్ఫురించేట్టుగా వరం ఇచ్చాడు. మానవజాతి కల్యాణం కోసం రామ కథను గానం చెయ్యమని ఆయనను ఆదేశించాడు. ఈ లోకంలో పర్వతాలూ, నదులూ నిలిచి ఉన్నంత కాలం రామాయణం కూడా నిలిచి ఉండగలదనీ, లోకంలోని జనుల పాపాలను అది పరిహరించగలదనీ ఆయన అన్నాడు.

సంగ్రహంగా వాల్మీకి పూర్వాశ్రమ చరిత్ర అధ్యాత్మరామాయణంలో కనిపిస్తుంది. ఆయన అసలు పేరు వాలి. ఒక అడవిలో దారిదోపిడి దొంగతనాలు చేస్తూ ఆయన జీవితం గడిపేవాడు. ఒక రోజున 'శంఖ' అనే మునిని ఆయన అడ్డగించాడు. తనను వధించబోతున్న దొంగతో ఆ ముని "నాయనా! నన్ను వధించే ముందు ఒక్కసారి ఇంటికి వెళ్ళి నీ సంపాదనను అనుభవిస్తున్న నీ భార్యా బిడ్డలు నీ పాపాల ఫలితాన్ని కూడా అనుభవిస్తారేమో కనుక్కొని రా!" అన్నాడు. మునిని ఒక చెట్టుకు గట్టిగా బంధించి దొంగ ఇంటికి వెళ్ళి భార్యా బిడ్డలను ప్రశ్నించాడు. నిర్మొహమాటంగా - అతని పాపాలతో తమ కెలాంటి సంబంధం లేదని

## శిశువుల శ్వాసప్రక్రియను గుర్తించే కొత్త పరికరం



సీమెన్స్ కంపెనీ తయారు చేసిన ఒక కొత్త పరికరం పసిపిల్లల శ్వాస ప్రక్రియను గుర్తించి తెరమీద ప్రదర్శిస్తుంది. ట్యూబ్‌లూ, ఎలెక్ట్రోడ్‌లు తగిలించి శిశువుకు ఇబ్బంది కలిగించకుండా ఇది భోగట్టా నమోదు చేస్తుంది. ఎప్పుడైనా కొద్ది నిముషాలు శ్వాసకు అంతరాయం ఏర్పడితే వెంటనే అలారమ్‌తో పెద్దలకు అది హెచ్చరిక చేస్తుంది.

"వివేకాన్ని కాక సుఖాన్ని కోరుకోడం
వార్ధక్యం రాకుండానే అమరత్వాన్ని కోరడం లాంటిది." —సిడ్నీ హారిస్

వారు చెప్పారు. అప్పుడు వాలికి జ్ఞానోదయం అయింది. నికృష్టమైన అవృత్తికి స్వస్తి చెప్పాడు. అనంతరం నారదముని వల్ల రామ నామం ఉపదేశం పొందాడు. రామ నామం జపించసాగిన వాలి శరీరం చుట్టూ పుట్టలు పెరిగాయి. మహర్షి అయి, ఆ పుట్టలో నుంచి బయటికి వచ్చాడు. పుట్టను సంస్కృతంలో 'వల్మీకం' అంటారు వల్మీకంలోనుంచి వెలువడడం వల్ల వాలి 'వాల్మీకి' అయాడు.

రావణ సంహారానంతరం సపరివారంగా శ్రీరాముడు అయోధ్యకు తిరిగి వచ్చి, పట్టాభిషేకం చేసుకొని రాజ్యం చేస్తున్నాడు. ఏడాది పాటు లంకలో ఉన్న సీత శీలం విషయంలో ప్రజలలో కొందరు సంశయం ప్రకటించారు. వెంటనే శ్రీరాముడు గర్భవతిగా ఉన్న సీతను అడవులలో వదలి రమ్మని లక్ష్మణుణ్ణి ఆదేశించాడు. అడవిలో నిస్సహాయురాలై ఉన్న సీతను వాల్మీకి కాపాడి తన ఆశ్రమానికి తీసుకు వెళ్ళాడు. అక్కడ లవుడు, కుశుడు అనే కవల పిల్లలను ఆమె ప్రసవించింది. వాల్మీకి వారిని పెంచి పెద్ద జేసి సమస్త విద్యలూ బోధించాడు. తాను రచించిన రామాయణ కావ్యం గానం చేయడం వారికి నేర్పాడు. అది తమ తల్లిదండ్రుల కథే అని లవ కుశులకు తెలియదు.

ఒకప్పుడు శ్రీరాముడు అశ్వమేధయాగం చేస్తూ వాల్మీకిని ఆహ్వానించగా ఆయన తన వెంట లవ కుశులను కూడా అయోధ్యకు తీసుకువెళ్లాడు. శ్రీరాముడు వైభవంగా కొలువు తీర్చి ఉన్న సభలో లవ కుశులు రామాయణం గానం చేశారు. కరుణ రస భరితమైన ఆ కథాగానం విని సభాసదులందరూ కంట తడిబెట్టుకున్నారు.

శ్రీరాముడు చలించిపోయాడు. ఆ పిల్లలు ఎవరో, ఆ కావ్యం వ్రాసిన మహాకవి ఎవరో అని ఆయన ఆశ్చర్యపోతూ ఉండగా వాల్మీకి ఆయనను సమీపించి తానే రామాయణ కర్తననీ, లవ కుశులు తన ఆశ్రమంలో సీత

(మిగతా 64 వ పేజీలో)

## విమానాల కంటె పారాచూట్‌లే ముందు!



విమానాలు కనిపెట్టక ముందే మనిషి పారాచూట్‌లతో భూమి మీదికి దిగడం నేర్చుకున్నాడు. 1785 లో బ్లాంఛర్డ్ తన బెలూన్‌లో పైకెగిరి అక్కడ నుంచి పారాచూట్‌కి కట్టిన ఒక తట్టలో ఒక కుక్కను ఉంచి క్రిందికి వదిలాడు. అది క్షేమంగా నేల మీద దిగింది. పారాచూట్ మీద భద్రంగా నేల మీదికి దిగిన మొదటి మనిషి ఆంద్రీ గార్నెరిన్ అనే ఫ్రెంచ్ జాతీయుడు. 1797 లో 1½ మైళ్ళ ఎత్తు నుంచి అతడు క్రిందికి దిగాడు.

# ఆరోగ్యానికి మూలికలు

## అత్తపత్తి

టి. వి. సుబ్రహ్మణ్యం

ఇండియాలోని ఉష్ణమండల ప్రాంతాలలో వర్షాలు పడగానే పొలాల్లోనూ, మైదానాల్లోనూ ఎక్కడ పడితే అక్కడ విపరీతంగా



పెరిగే ఒక సుకుమారమైన మొక్క 'అత్తపత్తి'. పొట్టిగా ఉండే మొదలు, సూదుల్లాంటి ఆకులు, నిటారుగా పైకి లేచే కాడల చివర చిన్న చిన్న పసుపువన్నె పూలు గల ఈ మొక్కను తేలికగానే మనం గుర్తు పట్టవచ్చును. చాలా ఉపయోగకరమైన ఓషధులలో 'అత్తపత్తి' ఒకటి అని భావిస్తున్నారు.

సంస్కృతంలో దీనిని 'లజ్జాళు' అనీ, హిందీలో 'లజ్జావతి' అనీ, మలయాళంలో 'ముక్కుటి' అనీ అంటారు. ఆధునిక శాస్త్రీయ పరిభాషలలో దీని పేరు 'బయోఫైటమ్ సెన్సీలియమ్'. 'నిద్ర భంగి' అని తెలుగులోనూ, 'తొట్టవాడి' అని తమిళంలోనూ వ్యవహరించే - మనిషి సమీపిస్తే నిజంగా ముడుచుకుపోయే - మొక్క మరొకటి ఉంది: 'మిమోసా ప్యూడికా' అని. దానికి చిన్న చిన్న ముళ్ళు ఉంటాయి. దానికీ, అత్తపత్తికీ ఎలాంటి సంబంధం లేదు.

'దశ పుష్పా'లలో ఒకటిగా ఆయుర్వేదం అత్తపత్తిని పేర్కొంది. కేరళ రాష్ట్రంలోని గ్రామీణ స్త్రీలు విష్ణుక్రాంత పూలతో పాటు అత్తపత్తి పూలను కూడా సౌభాగ్య చిహ్నంగా భావించి తలలో తురుముకుంటారు. కొన్ని ప్రాంతాలలో దీని ఆకులు కూరగా ఉపయోగిస్తారు.

భారతీయ 'వస్తుగుణ దీపిక' (materia medica) అత్తపత్తిని 'లఘువు' (తేలికైనది), 'స్వాదిష్టము' (రుచి గలది), 'కృమిఘ్నము' (క్రిములను హరించేది), 'పిత్తఘ్నము' (పైత్య ప్రకోపాన్ని తగ్గించేది). 'కఫఘ్నము' (శ్లేష్మాన్ని తగ్గించేది)

(మిగతా 58 వ పేజీలో)

"'అహం' వల్ల ఏర్పడే అంధకారం మామూలు చీకటి కంటె దట్టమైనది" — గాంధీ

# హరికథ కథ

డా. పప్పు వేణుగోపాలరావు



[బహుముఖ ప్రజ్ఞాశాలి అయిన డా. పప్పు వేణుగోపాల రావు (1948) ప్రస్తుతం మద్రాసులోని 'ది అమెరికన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇండియన్ స్టడీస్' రీజియనల్ ఆఫీసరుగా పని చేస్తున్నారు. 'సంస్కృతాంధ్ర భారత భాగవతములు - సదృశ విషయ పరిష్కార వివేచనము' అనే సిద్ధాంత వ్యాసం వ్రాసి ఆయన తెలుగులో డాక్టరేట్ పట్టం పొందారు. ఇటీవల అచ్చయిన ఆ సిద్ధాంత వ్యాసం కాక, 'భాగవత పురాణ కర్తృత్వం', 'ఆది భట్ల నారాయణదాసు కృతులు' వంటి పలు విషయాల మీద ఆంధ్రాంగ్లాలలో అనేక రచనలు ఆయన చేశారు. సరదాగా అప్పు డప్పుడు అష్టావధానాలు కూడా చేస్తూ ఉంటారు.]

నిజానికి - 'హరి కథ' అంటే విష్ణుమూర్తి ఎత్తిన వివిధ అవతారాలను గురించిన కథలే కావాలి. కాని, వాస్తవంలో భక్తి భావంతో ఇతర దేవతలను గూర్చి, భక్తులను గూర్చి చెప్పిన కథ అయినా 'హరి కథ' గానే పరిగణించ బడున్నాయి. 'గాంధీ చరిత్ర' వంటి రాజకీయ కథలు కూడా హరి కథలుగా వస్తున్నాయి. "దేవుణ్ణి గురించినవి గాని, దివ్యత్వం స్ఫురించే మహనీయులను గురించినవి గాని చమత్కారమైన సంఘటనలను మధురమైన సంగీత సాహిత్యాలతో జోడించి చెప్పే రసవత్కథ" అని హరి కథను శ్రీ ఆదిభట్ల నారాయణ దాసు నిర్వచించారు.

నైమిశారణ్యంలో సూతుడు శౌనకాది మహా మునులకు వివిధ పౌరాణిక గాథలను శ్రవణ మనోహరంగా వినిపించడం ఆరంభించిన నాడే 'హరి కథ'కు అంకురార్పణ

---

## వివిధ జాతుల లక్షణాలు

"అమెరికాలో నాకు ప్రధానంగా కనిపించింది - పిల్లలకు తల్లిదండ్రులు విధేయులుగా ఉండడం!" అంటారు డ్యూక్ ఆఫ్ విండ్సర్.

"చైనావారిలో రెండే వర్గాలు: ఒకటి - లంచం ఇచ్చే వర్గం: మరొకటి - లంచం పుచ్చుకునే వర్గం!" ఇది చైనావారిని గూర్చి రష్యన్‌ల అభిప్రాయం.

"గ్రీకులు సంవత్సరానికి ఒక్క సారే నిజం చెబుతారు" - ఒక రష్యన్ సామెత.

"సోదరుణ్ణి ద్వేషించేవాడు హంతకుడితో సమానం!" —వి. జాన్

జరిగిన దనవచ్చును. ఆ విధంగా ఆదిలో కేవలం పురాణ కాలక్షేపం రూపంలోనే హరి కథ ఆరంభమైంది. ఆధునిక యుగంలో 'హరి కథ' మొదట మహారాష్ట్ర దేశంలో వెలసిం దంటున్నారు. అయితే వారి 'హరికథ' రూపానికీ, ఆంధ్రుల హరి కథా స్వరూపానికీ



శ్రీ నారాయణ దాసు

తేడా కనిపిస్తుంది. శివాజీ వంశీకులు దక్షిణాదిలో తంజావూరును పాలిస్తున్న రోజులలో తమిళనాడులో 'హరి కథ' వ్యాప్తిలోకి వచ్చింది. ఆ రోజులలో సంగీత, సాహిత్యాల రాజధానిగా ఉన్న తంజావూరు నుంచే క్రమంగా హరి కథ ఆంధ్ర, కర్ణాటక ప్రాంతాలకు కూడా ప్రాకింది. శ్రీ ఆదిభట్ల నారాయణ దాసుకు పూర్వం తెలుగులో 'హరి కథ' అసలు లేదని అనలేము. అయితే తెలుగు హరికథకు ఆధునిక రూపం కల్పించిన వాడు మాత్రం నారాయణ దాసు గారే! అందుకే ఆయన 'హరికథా పితామహుడు'గా ప్రసిద్ధి పొందారు. మధుర గాత్రం గల ఒక గాయకుడు, కమనిందు చేసే ఒక నర్తకుడు, అసాధారణ ప్రతిభ గల ఒక కవి - ఈ ముప్పురూ కలిసి ఏర్పడిన సమష్టి రూపం నారాయణ దాసు గారు!

శ్రీకాకుళం జిల్లాలో సువర్ణముఖీ నదీ తీరాన ఉన్న అజ్జాడ గ్రామంలో 'ఆదిభట్ల' అనే ఇంటి పేరు గల ఒక ప్రసిద్ధ బ్రాహ్మణ కుటుంబంలో 1864 అక్టోబరు 1 న శ్రీ నారాయణదాసు జన్మించారు. సంగీతంలో అసాధారణ మేధావి అనే గుర్తింపు 1884 లో ఆయనకు లభించింది. తెలుగులోనూ, సంస్కృతంలోనూ అనర్గళంగా ఆయన ఆశు కవిత్వం చెప్పేవారు. ఆయన తొలి హరికథా కాలక్షేపం 1884 లో జరిగింది. అవాళ ఆయన సోదరుడు పేరన్న ఆయనకు వంతపాట పాడాడు. ఆ కథ 'ధ్రువ చరిత్ర'. తన హరి కథలను దాసుగారు 'యక్షగానాలు' అనేవారు. కలకత్తా మొదలుకొని కన్యాకుమారి దాకా ఇండియాలో ఎన్నో ప్రదేశాలలో ఆయన కథా కాలక్షేపాలు జరిగాయి.

ఒక రోజున ప్రార్థన అనంతరం 'ఏమి కథ చెప్ప మంటారు?' అని ఆయన సభ్యులను అడుగగా, కునికిపాట్లు పడుతూన్న ఒక

## మారణ హోమానికి దారి తీయగల పొరపాటు

"అవి (అణ్వస్త్రాలు) చాలా ప్రమాదం. కావాలని పూనుకునే అణ్వస్త్ర యుద్ధం కాదు సమస్య; పొరపాటున ఆరంభం అవడానికి వీలున్న అణ్వస్త్ర యుద్ధం - ఎవరు ఎప్పుడు ఏ చిన్న పొరపాటు చేస్తారో అనే ఊహ ఒళ్ళు జలదరింప జేస్తుంది."

డా. హోమీ సేత్నా

"'ఈ రోజు నాది!' అనుకోగల వానికంటె ఎక్కువ ఆనందం పొందేవాడు ఉండడు!" —హోరేస్

ఆకతాయి "హరి కథో, గిరి కథో ఏదో ఒకటి చెబుదూ!" అన్నాట్ట విసుగ్గా! అప్పుడు అతని మాట ప్రకారం 'గిరి' కథనే - గోవర్ధనోద్ధరణ కథను - అప్పటి కప్పుడు కల్పించి అళువుగా దాసుగారు చెప్పారట!

చాలా రోజులు దాసుగారికి సంతానం లేదు. "సావిత్రి కథ చెప్పరా నాయనా! సంతానం కలుగుతుంది" అన్న తల్లి ఆదేశం మేరకు ఆయన సావిత్రి హరికథ వ్రాశారు. ఆ తరువాత 1902 లో ఆయనకు ఒక కుమార్తె కలగడం, 'సావిత్రి' అని ఆమెకు పేరు పెట్టుకోడం జరిగింది. 1884 లో ఆయన మద్రాసు సందర్శించి పలు ప్రాంతాలలో కథా కాలక్షేపాలు చెప్పి, అక్కడి సంగీత రసికుల చేత 'భేష్' అనిపించుకున్నారు.

దాసుగారి హరికథలలో ఆయన వ్రాసిన 'మార్కండేయ' చరిత్ర సంగీత, సాహిత్యాల దృష్ట్యా ప్రశస్తమైం దని భావిస్తున్నారు. 1904 లో బెంగుళూరులో ఏర్పాటైన అఖిల భారత సంగీత విద్వాంసుల సభకు దాసుగారికి ఆహ్వానం వచ్చింది. అక్కడ ఆయన 'రుక్మిణీ కల్యాణం' కథ చెప్పారు. 'లయ బ్రహ్మ' అనే బిరుదు ఇచ్చి ఆ సభ వారు ఆయనను సత్కరించారు.

సంస్కృతంలో కూడా దాసుగారు హరి కథలు చెప్పారు. 'శ్రీకృష్ణ జననం', 'పితృ బంధ విమోచనం', 'ధర్మ సంస్థాపనం', అనే మూడు సంస్కృత హరికథలకు 'శ్రీహరి కథామృతం' అని పేరు. వీటిలో 'శ్రీకృష్ణ జననం' కథను 1913 లో కలకత్తాలో విశ్వకవి శ్రీ రవీంద్రనాథ ఠాకూర్ సమక్షంలో శ్రీ దాసుగారు చెప్పారు. ఆ రోజున ఆయన పాడిన భైరవి కీర్తన ఒకటి రవీంద్రుణ్ణి సమ్మోహితుణ్ణి చేసింది. 23 ఏళ్ళ అనంతరం 1936 లో రవీంద్రుడు విజయనగరం సందర్శించినప్పుడు దాసుగారితో ఆయన కలకత్తాలో తాను విన్న భైరవి రాగం ఇంకా తన గుండెల్లో మెదులుతూనే ఉందని అన్నారట.

1894 లో మైసూరు మహారాజా సమ

## దంత వైద్యునికి రోగి కళ్ళ రంగు చేసే మేలు



మెల్బోర్న్ (ఆస్ట్రేలియా) లోని వైద్య ప్రముఖుడు ఫిలిప్ సుట్టర్ అభిప్రాయానుసారం కొద్ది సంవత్సరాలలో దంత వైద్యుడు రోగి కళ్ళ రంగును చూసి వారికి గల బాధను ఓర్చుకునే శక్తిని గ్రహిస్తారు. నల్లని కళ్ళ వారి కంటె నీలిరంగు కళ్ళు గల రోగులు పళ్ళు పీకేటప్పుడు కలిగే బాధను ఎక్కువగా ఓర్చుకోగలరని ఆయన అంటున్నారు. పీలం, ఆకు పచ్చ, ఊదా రంగు కళ్ళు గల రోగులు మొద్దు బారేట్టు చేసే కొకెయిన్ ఇంజక్షన్ అక్కర లేకుండానే పళ్ళు పీకించు కుంటున్నారట!

'మౌనం' సంతోషానికి చక్కని ఆహ్వానం!" ——షేక్స్పియర్

క్షంలో దాసుగారు 'గజేంద్ర మోక్షం', 'రుక్మిణీ కళ్యాణం' కథలు చెప్పారు. ఆయన ప్రతిభకు ముగ్ధుడైన మహారాజా ఆయనను ఘనంగా సత్కరించడమే కాక, తమ ఆస్థాన విద్వాంసుడుగా ఉండిపొమ్మని అర్థించారట। దానికి వినయంగా దాసు గారు "మానవుల కొలువు నేను చేయలేను।" అన్నారట।

1923 లో కాకినాడలో జరిగిన కాంగ్రెసు మహాసభలో దాసుగారు కథా కాలక్షేపం చేసి సరోజినీ దేవి వంటి కవయిత్రి ప్రశంసలు అందుకున్నారు. ఉమర్ ఖయ్యామ్ రుబాయత్‌లను దాసుగారు సంస్కృతీకరించారు. 'కాశీ శతకమ్', 'తారకమ్' వంటి మరి కొన్ని రచనలు కూడా సంస్కృతంలో ఆయన చేశారు.

1915 లో దాసుగారికి భార్యా వియోగం సంభవించింది. బ్రతికి ఉన్నన్నాళ్లూ భర్తచేత రామకథ చెప్పించుకుని వింటూ ఉండడం ఆమెకు పరిపాటి। అందుచేత-ఆమెకు స్మారక చిహ్నంగా 'యథార్థ రామాయణం' అనే పేరుతో రామాయణాన్ని 6 హరి కథలుగా ఆయన వ్రాశారు. దానిలో ఆయన వ్రాసిన పాటలూ, పద్యాలూ ప్రజల నోళ్ళలో నాని పోయినవి ఎన్నో ఉన్నాయి. డజన్ల కొద్దీ శిష్యులను ఆయన తయారు చేశారు. వేష భాషలలో కూడా ఆ శిష్యులకు ఆయనే ఒరవడి అయారు.

షేక్స్పియర్ రచనల నుంచి నవ రసాలకూ ఉదాహరణ ప్రాయమైన తొమ్మిది భాగాలు ఎన్నిక చేసి, వాటితో సదృశమైన కాళిదాసు రచనలను ఆయన ఎత్తి చూపారు. వాటి తెలుగు అనువాదాన్ని 'నవరస తరంగిణి' అనే పేర ప్రకటించారు.

చివరి రోజులలో 16 ఏళ్ళ పాటు విజయనగరం సంగీత కళాశాల ప్రధానాచార్యులుగా ఉండి, 1936 లో పదవీ విరమణ చేసి, సుప్రసిద్ధ వయొలిన్ విద్వాంసులు శ్రీ ద్వారం వెంకటస్వామి నాయుడు గారికి ఆ బాధ్యతను ఆయన వప్పగించారు.

(మిగతా 51వ పేజీలో)

## ముందుకు చూడు - వెనక్కు కాదు!



ప్రేమను ఆరాధించు—ద్వేషాన్ని కాదు
విజయాన్ని గురించి ఆలోచించు—
పరాజయాన్ని గూర్చి కాదు
ఆరోగ్యాన్ని వరించు—జబ్బును కాదు
'మంచి చెయ్యి'—'చెడు' కాదు
సౌభాగ్యాన్ని కోరుకో—దారిద్ర్యాన్ని కాదు
మేలే జరుగుతుం దనుకో—కీడు కాదు
జీవితాన్ని భావించు—చావును కాదు
మైత్రి పాటించు—శత్రుత్వం కాదు
ఆశ నీకు ఆసరా—నిరాశ కాదు
ప్రశాంతి ముఖ్యం—అలజడి కాదు
ముందుకు చూడు—వెనక్కు కాదు।

—జాన్ హారిస్

"తొందరపాటు గొప్ప అనర్థ హేతువు।" —ఇంగ్లీష్ సామెత





ప్రపంచం అంతటా మానవుని వ్యక్తిత్వం విరూపం చెందుతూ తీవ్రమైన ఆందోళన కలిగిస్తున్న ప్రస్తుత తరుణంలో గాంధీ మహాత్ముడు మనకు గుర్తురావడం సహజం.



శత్రువులను సంహరించే మారణాయుధాల కంటె ప్రజల ఆత్మశక్తి మరింత తిరుగు లేని దని ఆయన బోధించారు. హిందూమత నేతగా, సంఘ సంస్కర్తగా, భారత జాతీ యోద్యమ సారథిగా భారతీయుల హృదయాల నుంచి భయాన్ని ఆయన తరిమి వేశారు. శాంతియుత పద్ధతులతో పోరాడి భారతజాతికి స్వాతంత్ర్యం సంపాదించారు; 'మహాత్ముడు' గా వినుతి కెక్కారు.

ప్రస్తుతం గుజరాత్ రాష్ట్రంలో ఉన్న కథియవాడ్ ప్రాంతంలోని పోర్‌బందర్‌లో 1869 అక్టోబర్ 2వ తేదీన మోహన్‌దాస్ కరమ్‌చంద్ గాంధీ జన్మించారు. రాజ్‌కోట,



విద్యార్థిగా గాంధీ

భావనగరాలలో విద్యాభ్యాసం చేశారు. ఆయన తండ్రి కరమ్‌చంద్ గాంధీ రాజ్‌కోటలో

## 25 పాయలుగా చీల్చబడిన మనిషి వెంట్రుక

బెంగుళూరులోని హిందూస్థాన్ ఏరో నాటిక్స్ లిమిటెడ్ (HAL) లో పని చేస్తున్న ఒక ఇంజనీరు-టి. నంజప్ప - ఇటీవల మానవుల తల మీది వెంట్రుకను 25 పాయలుగా చీల్చగలిగాడు. 'గిన్నిస్ బుక్ ఆఫ్ రికార్డ్స్' ప్రకారం ఇంతకు ముందు వెంట్రుకను 16 పాయలుగా మాత్రమే చీల్చడం సాధ్యమైంది.

"తొందర రాక్షస లక్షణం!" - ఖురాన్

దివాన్‌గా పని చేసేవారు. తల్లి పుత్లీబాయ్ పూర్వాచార పరాయణురాలు. 1883 లో తన 13 వ ఏట కస్తూరీబాయి గాంధీని ఆయన వివాహం ఆడారు.

తన 19వ ఏట గాంధీ న్యాయశాస్త్రం అభ్యసించడానికి బొంబాయిలో ఓడ ఎక్కి



లండన్‌లో గాంధీ

ఇంగ్లండు బయలు దేరారు. అక్కడ 1891లో బారిస్టరు పట్టా పొందారు. ఇండియా తిరిగి వచ్చాక, కొద్దికాలం పాటు బొంబాయి హైకోర్టులో న్యాయవాదిగా ప్రాక్టీసు చేశారు. 1893 లో ఒక గుజరాతీ ముస్లిమ్ సంస్థ తరపున వాదించడానికి ఆయన దక్షిణాఫ్రికా వెళ్ళారు. ఆ వెళ్ళడం వెళ్ళడం దాదాపు 20 ఏళ్ళు ఆయన అక్కడ ఉన్నారు.

దక్షిణాఫ్రికాలో లాయర్‌గా ప్రాక్టీసు చేస్తున్న రోజులలోనే అక్కడకు వలస పోయిన భారతీయుల హక్కుల సంరక్షణ కోసం గాంధీ పోరాటం ప్రారంభించారు. తెల్లవాళ్ళు నడిచే రోడ్డు మీద భారతీయులను నడవ నిచ్చేవారు కాదు. వారు ఎక్కిన రైలు పెట్టెలలో వీరు ఎక్కేందుకు వీలు లేదు. అలా ఎక్కితే అవమానించి, కొట్టి, ఒక్కొక్కప్పుడు జైలుకు కూడా పంపించే వారు.

గాంధీ ఎక్కడకు వెళ్ళినా ఆయనను 'సామి', 'కూలి' అని అవమానంగా చూసే వారు. కోర్టుకు వెళితే మేజిస్ట్రేట్ ఆయనను తలపాగా తీసివేయ మన్నారు. ఆయనకు కోపం వచ్చి వెంటనే కోర్టు వదలి వెళ్ళి



న్యాయవాదిగా గాంధీ

పోయారు. ప్రిటోరియాకు రైల్లో ఫస్ట్‌క్లాస్‌లో ప్రయాణం చేస్తూండగా, భారతీయుడు అనే కారణంచేత మధ్యలో ఆయనను దింపేశారు.

---

## 'జాతీయుతా భావం పునరుద్ధరించండి!'

"భారత స్వాతంత్రోద్యమంలో కనిపించిన జాతీయ భావావేశాన్ని పునరుద్ధరించాలి. ఇండియా ఏకత్వానికి భంగం కలిగించే శక్తుల ఆట కట్టించడానికి అది అవసరం. 'నేను ప్రధానంగా భారతీయుణ్ణి' అనే భావం ప్రతి పౌరునిలోనూ కలిగించాలి."

—జగద్గురు శ్రీ జయేంద్ర సరస్వతి
(కంచి కామకోటి పీఠాధిపతి)

"పగ అడుగించు టెంతయు శుభంబు!" —తిక్కన

తక్కువ దూరం ఆయన 'కోచ్' లో ప్రయాణం చేయవలసి వచ్చింది. ఆ కోచ్ కండక్టర్ ఆయనను లోపలకు రానీయకుండా డ్రైవర్ ప్రక్కన కూర్చో మన్నాడు. తిట్టి, కొట్టి అవమానపరచాడు. ఎన్నెన్నో అలాంటి అవమానాలకు గాంధీ గురి అయినా, ఇంగ్లీషు



గాంధీ దండీ యాత్ర

వారి మీద ద్వేష భావం పెంచుకోకుండా, హింసకు పూనుకోకుండా, శాంతియుతంగా వారిని ఎదిరించి పోరాడి, అక్కడ భారతీయులకు కొన్ని హక్కులు ఆయన సాధించగలిగారు. అహింసతో కూడిన ఆయన పోరాటం 'సత్యాగ్రహం' గా ప్రసిద్ధి పొందింది. 'సత్యాగ్రహం' అంటే 'సత్యాన్ని నిర్భయంగా చాటడం' అని అర్థం. గాంధీ జీవితంలో 'సత్యం', 'అహింస' అత్యంత ప్రాధాన్యం వహించాయి.

అలా కొంతవరకు విజయం సాధించి, 1914 లో గాంధీ ఇండియా తిరిగి వచ్చారు. దేశం అంతా అప్పుడు అట్టుడికిన ట్లుడికి పోతూంది. భారతీయులకు స్వపరిపాలనాధికారం ఇచ్చే ఉద్దేశం బ్రిటిష్ వారికి లేదని గాంధీకి స్పష్టం అయింది. 1918 ఏప్రిల్ నెలలో రౌలత్ బిల్లుల పట్ల నిరసనగా దేశం అంతటా పెద్ద ఎత్తున ఆయన హర్తాళ్ జరిపించారు. ఆ సందర్భంలో కొంత హింస జరిగినందుకు పశ్చాత్తాపంతో సబర్మతీ నది ఒడ్డున ఉన్న తన ఆశ్రమంలో 3 రోజులు గాంధీ ఉపవాసం చేశారు. సత్యాగ్రహాన్ని వెంటనే నిలుపు చేశారు.

1921 లో గాంధీ అర్ధనగ్నంగా ఉన్న తన ప్రజల పట్ల సానుభూతితో కేవలం ఒక అంగవస్త్రం ధరించడం ప్రారంభించారు. తరువాత కొద్ది కాలానికే అహింసాయుతమైన సహాయ నిరాకరణోద్యమం ప్రారంభించారు. దానిలో ప్రధానమయిన అంశాలు: ప్రభుత్వోద్యోగాలనూ, నూతనంగా వెలసిన శాసన సభలనూ, న్యాయస్థానాలనూ, విద్యాలయాలనూ బహిష్కరించడం, విదేశీ సరకులను నిరాకరించడం. ఉద్యమం అతివేగంగా దేశం నలుమూలలా వ్యాపించింది. వేలాదిమంది జైళ్ళకు వెళ్లారు. అయితే 1922 చౌరాచౌరీలో హింస తల

---

## ముఖచిత్ర వ్యాఖ్య

(ఫిబ్రవరి 1984)

★

"అందరి కనులు నీ మీద!
నీ కను లేమో 'విస్‌డమ్ మీద!!"
—తాళ్ళపల్లి రమేష్, శనిగరము.

* * *

"అరవిరిసిన ఓ మందారం!
ఎందుకు నీ కంత సింగారం?"
—ఎమ్. సునిత్‌కుమార్, చిలకలూరి పేట.

* * *

"కన్నుల నిండా కలలు!
కోర్కెలకు లేవు సంకెలలు!!"
—పి. లక్ష్మి, హైదరాబాద్-28

ఎత్తిందనే కారణంతో గాంధీ ఆ ఉద్యమాన్ని నిలుపు చేసి, బార్డోలీలో 5 రోజులు ఉపవాసం చేశారు.

'యంగ్ ఇండియా' లో ఆయన వ్రాసిన వ్యాసాలు రాజద్రోహ పూరితంగా ఉన్నా యని సబర్మతీలో ఆయనను అరెస్టు చేశారు. జడ్జి



కస్తూర్బా గాంధీ

'బ్రూమ్‌ఫీల్డ్' సమక్షంలో అహమ్మదాబాద్ లో జరిగిన సుప్రసిద్ధమయిన విచారణలో గాంధీజీ తనపై మోపిన నేరాలను అన్నిటినీ ఒప్పుకుంటూ చిరస్మరణీయమైన ప్రకటన చేశారు. 6 ఏళ్ళు కారాగార శిక్ష విధించి, ఆయనను ఎరవాడ జైలుకు పంపారు.

1924 జనవరిలో ఎలాంటి షరతులూ లేకుండా గాంధీజీని విడుదల చేశారు. 1924 తరువాత గాంధీజీ నడిపిన అన్ని ఉద్యమాల లోనూ రాట్నం ప్రధాన పాత్ర వహించింది.

1930 మార్చి నెలలో గాంధీ ఉప్పు చట్టం పట్ల అహింసాయుతమయిన నిరసన తెలపడం కోసం ఉద్యమం ప్రారంభించారు. మార్చి 12 న సబర్మతీ ఆశ్రమం నుంచి 79 మంది వాలంటీర్లతో గాంధీ అక్కడకు 200 మైళ్ళ దూరాన ఉన్న దండీ యాత్రకు బయలుదేరారు. ఏప్రిల్ 6 న సముద్రతీరాన ఉప్పు సేకరించి ఉప్పు చట్టాన్ని ఆయన ధిక్కరించారు.



బాలునితో గాంధీ

సాయుధ పోలీసులు 'కారడీ' వద్ద ఆయనను అరెస్టు చేసి, విచారణ లేకుండా ఎరవాడ జైలుకు పంపారు.

(మిగతా 49 వ పేజీలో)

## అమెరికాలోని నిరుపేదల సంఖ్య

ప్రపంచంలో మిక్కిలి సంపన్నమైన అమెరికా దేశంలో లక్షలాది మంది దారిద్ర్య రేఖకు దిగువను నికృష్టమైన జీవితాలు గడుపుతున్నారు. అమెరికా జనాభాలో 15 శాతం (సుమారు 3.5 కోట్ల మంది) అలాంటివారున్నారు. అమెరికన్ బాలలలో ప్రతి 5 గురిలో ఒకరు నిరుపేద కుటుంబానికి చెందినవారు. అమెరికన్ నీగ్రోలలో ప్రతి ఇద్దరిలో ఒకరు అలాంటి వారు.

"ప్రజలు సుఖంగా బ్రతకాలంటే ముందుగా మతాలన్నీ రద్దు చెయ్యాలి!" —కార్ల్ మార్క్స్

# జీవితం నేర్పిన పాఠాలు

## విశ్వాసాన్ని మించిన అండ లేదు!

శ్రీ జి. ఎం. జగత్యానీ



[శ్రీ జి. ఎం. జగత్యానీ బొంబాయిలోని ఒక సుప్రసిద్ధ స్వచ్ఛంద పత్రికా రచయిత. ఈయన వ్రాసే వ్యాసాలు చాలా వరకూ హిందూ మతానికీ, శ్రీ వివేకానంద స్వామి బోధనలకూ సంబంధించినవే. ఎన్నో పుస్తకాలు కూడా ఈయన వ్రాసినవి ఉన్నాయి ]

**1942** 'క్విట్ ఇండియా' ఉద్యమంలో మరి కొందరు అజ్ఞాత మిత్రులతో పాటు నన్నూ అరెస్టు చేశారు. బట్టలు ఊడదీసి స్తంభానికి కట్టి, నిర్దాక్షిణ్యంగా కొరడాలతో కొట్టారు. కావాలనే నేను ఆ ఉద్యమంలో పాల్గొన్నాను. ఉద్యమానికి నా రక్తం ధార పోశాను. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత రాజకీయ నాయకులు 'నిజాయితీ' కన్న పిమెంటుకు అధిక ప్రాధాన్యం ఇస్తారని నేను ఆశించ లేదు. దేశమాతపట్ల కన్న ధనం మీద ఎక్కువ మక్కువ చూపుతారని గాని, మంచి తనాని కన్న బంగారానికి ఎక్కువ విలువ ఇస్తారని గాని నేను అనుకోలేదు.

దేశంలో ఇటీవల వస్తున్న పరిణామాలు మరీ మనస్సును వికలం చేస్తున్నాయి. మన

### శ్రీ సి.వి. రామన్ దేశ భక్తి

1930 లో ఫిజిక్స్‌లో నోబెల్ బహుమతి అందుకుంటూ శ్రీ సి.వి. రామన్ ఆ సభలో ఉన్న బ్రిటిష్ మంత్రి ముఖంలోకి తేరిపార చూస్తూ ఇలా అన్నారు: "ఈ బహుమతిని వ్యక్తిగతంగా నేను అందుకోడం లేదు. నా దేశం తరఫునా, ప్రస్తుతం జైళ్ళలో మ్రగ్గుతున్న నా తోటి దేశ భక్తుల తరఫునా ఈ బహుమతిని నేను స్వీకరిస్తున్నాను."

(ఇర్వింగ్ వాలెస్ 'ది ప్రైజ్' నుంచి)

"ద్వేషం సుదీర్ఘ కాలం సాగే ఆత్మహత్య!" —డగ్లస్ స్టీర్

రాజకీయ నాయకులలో చాలా మంది గంటల తరబడి ఉపన్యాసాలు దంచేవారే గాని చేసిన వాగ్దానాలు నిలబెట్టుకునే వారు కనిపించడం లేదు. జీవితం నుంచి నేను నేర్చుకున్న మొదటి పాఠం: "రాజకీయ నాయకులకు ఆమడ దూరంలో ఉండు!" అని.

చాలా కాలం క్రితమే నేను ప్రబోధాత్మక మైన 'షూటింగ్ స్టార్' అనే పత్రిక ఒకటి నడపడం మొదలు పెట్టాను. హిందూ మతాన్ని గురించీ, వివేకానంద స్వామిని గురించీ పుస్తకాలు వ్రాసి ప్రచురించాను. దేనికీ మరొకరి సాయం అపేక్షించి ఎరుగను. నా ఒక్క చేతిమీదుగానే ఈ భగీరథ ప్రయత్నం సాగిస్తున్నాను. చాలా సామాన్యమైన వ్యక్తిని నేను. అడుగడుగునా ఎన్నెన్నో కష్ట నష్టాలను నేను ఎదుర్కొన్నాను. నల్లని కారు మబ్బులు క్రమ్మి ఎన్నో సార్లు కబళిస్తామని నన్ను బెదిరించాయి. అయినా సర్వ శక్తి మంతుడైన భగవంతునిలో నా విశ్వాసం చెక్కు చెదర లేదు. కాశ్మీర్ నుంచి కన్యా కుమారి దాకా ఎందరెందరో క్రొత్త వారు నాకు మిత్రులయారు. నా కృషి నేను మాన లేదు. మధ్యలో మరీ చురుకుగా పని సాగక పోవడం, నా ఆరోగ్యాన్ని అలక్ష్యం చేయడం జరిగితే జరిగి ఉండవచ్చు గాని ఉద్యమాన్ని విరమించటం మాత్రం జరుగ లేదు నేటికీ నిరాఘాటంగా అది సాగుతూనే ఉంది. జీవితం నాకు నేర్పిన రెండో పాఠం: "భగవంతునిలో నీ విశ్వాసం ఎన్నడూ సడల నీయకు!" అని.

హిందూ మతం నాకు ఉచ్ఛ్వాస నిశ్వాస వంటిది. హిందువు నైనందుకు నేను గర్వపడతాను. ఆ మాట బహిరంగంగా చెబు

---

## సూర్య కేంద్రంలో ఇనుము ఉందా?



గ్రహాల కేంద్ర భాగం వద్ద ఇనుము ఉన్నట్టే సూర్యుని కేంద్రంలో కూడా ఇనుము ఉండి ఉండవచ్చు నని శాన్‌డియాగో లోని 'జి. ఏ. ఇన్‌కార్పరేటెడ్'కు చెందిన అమెరికన్ శాస్త్ర వేత్త కార్ల్ రౌస్ భావిస్తున్నారు. సూర్యుని కేంద్రం వద్ద ఉండే పదార్థం .5 శాతం మాత్రమే! అయినా అది సౌర కుటుంబంలోని మిక్కిలి పెద్ద గ్రహం అయిన గురుని కేంద్రం కంటె 100 రెట్లు పెద్దది!

---

"పుట్టుకతోనే ఎవ్వరూ స్త్రీ ద్వేషి కాదు;
ప్రకృతికి అలాంటివి గిట్టవు." —హారీ బ్రిడ్జెన్

తాను. కొందరు ప్రముఖులే తాము హిందువుల మని చెప్పుకోడానికి సిగ్గు పడుతూ ఉండడం, 'సెక్యులరిజమ్' నినాదం చాటున దాక్కోవా అని చూడడం నాకు బాధ అనిపిస్తుంది. జీవితంలో నేను నేర్చుకొన్న మూడో పాఠం: "హిందువుగా పుట్టినందుకు నువు గర్వపడు!" అని.

ఇప్పుడు నాకు 60 ఏళ్ళు. ఇం కెన్నాళ్ళు ఈ బండి లాగుతానో నాకు తెలియదు. కాని ప్రతి వ్యక్తీ సమాజం నుంచి తాను పొందిన దానిలో కొంత భాగం తిరిగి సమాజానికి అర్పించి తీరాలి అని నా విశ్వాసం. వయస్సు ప్రతిబంధకం కాదు! తీరిక లేదనడం కుంటి సాకు. కావలసింది – 'సమాజానికి నేను ఎంతో కొంత మేలు చెయ్యాలి' అనే దృఢమైన సంకల్పం. సత్సంకల్పం గల వ్యక్తులు భుజాలు కలిపితే–వారి సంఖ్య ఎంత తక్కువైనా ఫరవాలేదు–అద్భుత కార్యాలు సాధించగలరు. నిజానికి గాలిలో నుంచి విభూతి రప్పించడం, బుట్టలో నుంచి ఎలుకను తియ్యడం కావు 'అద్భుతాలు' (miracles)! మనల్ని మనం మార్చుకోడం, చుట్టూ ఉన్న సంఘాన్ని మార్చడం, మనోవైఖరిలో దృక్పథంలో గొప్ప మార్పు సాధించడం అదే నిజమైన 'అద్భుతం'!

## ప్రాచీన తమిళ నాడులో విద్యార్థులకు మధ్యాహ్న భోజనం

తమిళనాడులోని అణియూర్‌లో దొరికిన చోళ రాజుల కాలం నాటి ఒక శాసనం వల్ల క్రీ.శ. 1243 లో ఉపాధ్యాయులు మధ్యాహ్న సమయంలో తమ విద్యార్థులకు ఉచితంగా భోజనాలు పెట్టేవా రనీ, అందుకు అవసరమైన గ్రాంట్లను రాజులు వారికి ఇచ్చేవా రనీ తెలుస్తూంది. 11 వ శతాబ్దంలో 'తిరువళ్ళవల్' దేవాలయంలో విద్యార్థులకు మధ్యాహ్నపు పూట ప్రసాదాలు పెట్టేవారట.

## టాల్‌స్టాయ్ – రవీంద్రుడు



సుప్రసిద్ధ రష్యన్ రచయిత టాల్‌స్టాయ్‌కీ, జగత్ ప్రసిద్ధుడైన వంగకవి రవీంద్రనాథ్ టాగూర్‌కీ మధ్య ఆశయాలలోనూ, భావనా ధారలోనూ ఎన్నో సామ్యాలు కనిపిస్తాయి. రవీంద్రుడు తన 'గోరా' నవలలో కాల దోషం పట్టిన భారతీయ సంప్రదాయాలను విమర్శించగా, నిరర్థకంగా తయారైన క్రైస్తవ మత నైతిక సూత్రాలను టాల్‌స్టాయ్ తీవ్రంగా విమర్శించారు.

"పరులను ద్వేషించడం ఎలుకలను చంపడం కోసం
సొంత ఇంటికి నిప్పంటించుకోడమే!" —హెచ్. ఇ. ఫాస్‌డిక్

# మీకు తెలుసా?

రిక్షా కనిపెట్టినవాడు:

జపాన్‌లో ఉన్న ఒక అమెరికన్ బాప్టిస్ట్ మినిసర్ 1888 లో రిక్షా కనిపెట్టాడు.

* * *

విరివిగా సాగు చేసే పండు:

ప్రపంచంలో మిక్కిలి విరివిగా కాసేది ఆపిల్ పళ్ళు. పీర్ పండుది రెండో స్థానం.

* * *

సూర్యునిలో ఉన్న ద్రవ్యం ఏది?

సూర్యునిలోని ద్రవ్యంలో ఉదజని గాని, హీలియమ్ గాని 95 శాతం ఉంది.

* * *

కాలువల జంక్షన్‌లో ట్రాఫిక్ లైట్లు:

వియెన్నా (ఇటలీ) లో రెండు కాలువలు కలిపిన జంక్షన్‌లో పడవల రాక పోకలను కంట్రోల్ చేసేందుకు ట్రాఫిక్‌లైట్లు అమర్చారు.

* * *

సోవియెట్ రష్యాలో భూ భాగం:

భూగోళం మీద కనిపించే 'నేల' భాగంలో 1/6 వ వంతు సోవియెట్ రష్యాలో ఉంది.

* * *

'పోలీస్' ఫ్రెంచ్ పదం!:

'పోలీస్' అనే ఫ్రెంచ్ మాట 1714 లో మొదటి సారిగా ఇంగ్లీష్‌లో వాడుక చేయబడింది.

* * *

అమెరికన్ నటుని కాళ్ళకు ఇన్సూరెన్స్:

అమెరికన్ నటుడు ఫ్రెడ్ అస్టాయిర్ తన కాళ్ళను 6,50,000 డాలర్లకు ఇన్సూర్ చేశాడు.

* * *

జలుబుకి శాస్త్రీయమైన ఇంగ్లీషు పేరు:

మామూలుగా చేసే జలుబును ఇంగ్లీషులో

(మిగతా 24 వ పేజీలో)

## పోకెట్ టెలివిజన్ సెట్



బ్రిటన్‌కు చెందిన సర్ క్లైవ్ సింక్లేర్ ఇటీవల తాను కొత్తగా నిర్మించిన పోకెట్ టెలివిజన్ సెట్‌ను లండన్‌లో ప్రదర్శించారు. 5 సెం.మీ. ల తెర ఉన్న ఈ టీ వీ. సెట్ బరువు 280 గ్రాములు మాత్రమే: ధర సుమారు రూ. 1,000 లు.

"ఎడబాటు ప్రేమను పెంచుతుంది." —డేవిసన్

# మన నిత్యజీవితంలో నిమ్మకాయ

శ్రీమతి క. భార్గవి



[శ్రీమతి కె. భార్గవి ప్రస్తుతం అనంతపురం లోని 'శ్రీ సత్య సాయీ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హైయర్ లెర్నింగ్' లో వృక్షశాస్త్రంలో లెక్చరర్‌గా పని చేస్తున్నారు.]

నిమ్మకాయను ఇంగ్లీషులో 'లెమన్' అనీ, 'లైమ్' అనీ అంటారు. అయితే ఆ రెండింటికీ కొంచెం తేడా ఉంది. లెమన్ గజ నిమ్మ. పెద్ద సైజు కాయలు కాస్తుంది. దాని తోలు మందంగానూ, గరుకుగానూ ఉంటుంది. చిన్న సైజు నిమ్మకాయ 'లైమ్'. వృక్షశాస్త్ర పరిభాషలో 'లెమన్' ని 'సైట్రస్ లిమోనియమ్' అంటారు.

మధ్యప్రదేశ్, కుమావోం, ఉత్తర భారత దేశాలలో నిమ్మ తోటలు ఎక్కువ. మొదలు 20 అడుగుల ఎత్తు దాకా పెరిగే నిమ్మ చెట్టుకి చిన్న చిన్న ముళ్ళుంటాయి. దీని పూలు తెల్లగానూ, ఎర్రగానూ ఉంటాయి. మామూలు నిమ్మ గుండ్రం గానూ, గజ నిమ్మ అండాకారంగానూ ఉంటుంది. నిమ్మకాయలు పచ్చిగా ఉన్నప్పుడు ఆకు పచ్చగానూ, పండితే లేత పసుపు వన్నె లోనూ ఉంటాయి. కాయలను చెట్టున పండ నీయకుండా ఆకుపచ్చగా ఉండగానే కోసి పండబెడతారు.

---

## మిణుగురులు

"పేరుకి ఆంధ్రులం!
సంస్కృతికి ఆంగ్ల మానస పుత్రులం!!"
—ఎమ్. రాజేశ్వరరావు, నర్సంపేట.

* * *

"మంచి వారికి ఉండదు కూడు!
వంచకులకే అన్నీ సమకూడు!!"
—అలవర్తి వెంకటేశ్వరరావు,
నందివెలుగు (గుంటూరు జిల్లా).

* * *

"తప్పు లెంచడం మానవ సహజం
మన్నించడం మహాత్ముల నైజం!"
—వి. సుందరరావు,
సీతారాంపురం మైన్స్ (గుంటూరు జిల్లా).

"పెందరాడే పడుకో! పెందరాడే నిద్ర లే!
ఆరోగ్యానికీ, ఐశ్వర్యానికీ అది దగ్గర దారి! —ఫ్రాంక్లిన్

నిమ్మకాయ తోలు నుంచి ఒట్టిపట్టి నిమ్మ నూనె తయారు చేస్తారు. హారతి కర్పూరం లాగ ఇది హరించి పోయే స్వభావం కలది. చిన్న నిమ్మకాయలో కంటె గజనిమ్మలో



రసమూ, నైట్రిక్ ఆమ్లమూ ఎక్కువగా ఉంటాయి. నిమ్మకాయలో ఉపయోగపడే భాగాలు: పండిన పండు తాలూకు తోలు, దానినుంచి తీసే నిమ్మ నూనె, నిమ్మ రసం.

ఒక పెద్ద సైజు నిమ్మకాయలో శక్తి - 34 కేలరీలూ, ఇనుము .0006 గ్రాములూ, కాల్షియమ్ .024 గ్రాములూ భాస్వరం .022 గ్రాములూ, పొటాసియమ్ .0442 గ్రాములూ, 'ఏ', 'బి' విటమిన్‌లూ ఉంటాయి. శరీరానికి పుష్టి చేకూర్చే పదార్థాలే!

చౌకగా లభించే నిమ్మకాయను వివిధ దేశాలలో వేర్వేరు పద్ధతులలో ఆహార పదార్థాలలో వాడుతున్నారు. పోషకాహారం కావడమే కాక, ఆహారానికి ఇది క్రొత్త రుచి నిస్తుంది. ఔషధంగా కూడా నిమ్మకాయ ప్రశస్తమైంది. 'నిమ్మ' లో అనేక రకాలు ఉన్నా, అన్నిటి ప్రధాన ధర్మాలూ ఇంచుమించు ఒకటే!

నిమ్మకాయలో ఊపిరి తిత్తులకు ఇన్ఫెక్షన్ రాకుండా కాపాడే 'సి' విటమిన్ ఎక్కువగా ఉంది. అన్ని రకాల వైరస్‌లనూ విటమిన్ 'సి' నశింపజేస్తుంది. డిఫ్తీరియా, టెటానస్ వంటి వ్యాధుల తాలూకు విషక్రిములను సంహరిస్తుంది.

భోజనానికి అరగంట ముందు నిమ్మకాయ రసం తాగితే జీర్ణశక్తి పెరుగుతుంది. ఒక నిమ్మకాయ చెక్క రసం పిండి, కాస్త పంచదార, లెమనేడ్, చల్లని నీళ్ళు చేర్చి తయారు చేసిన పానీయం వేసవి రోజులలో ఆహ్లాదాన్ని చేకూరుస్తుంది. మశూచి, పొంగు, ఆటలమ్మ వంటి వ్యాధులలో మిక్కిలి దప్పికతో బాధపడే రోగులకు 15 మొదలు 25 గ్రాముల నిమ్మరసం దప్పిక కట్టిస్తుంది.

ఒక వంతు నిమ్మరసం, మూడు వంతులు

---

## పాఠకుల అభిప్రాయాలు



"కనిపించని దేవుడికి ధూప దీప
నైవేద్యాలు!
కనిపించే మానవుడికి ఛీత్కారపు
సత్కారాలు!!"

—అద్దేపల్లి భరత్‌కుమార్, బాపట్ల.

* * *

"కష్టజీవుల కన్నీరు
కాకారాయుళ్ళకు పన్నీరు!"

— యక్కల ప్రసాదరావు, ఖమ్మం.

* * *

"అందగత్తైదుండగ
పంతులు ఎందుకు దండుగ!"

—కె. అంబేద్కర్, ప్రజ్ఞం,
(గుంటూరు జిల్లా)

"స్వర్గం ఎక్కడో లేదు; అది మన మనస్సుల్లోనే ఉంది!" —జె. బర్రోన్

నీళ్ళు, తగినంత పంచదార వేసుకుని రోజూ ప్రొద్దునా, సాయంత్రం తాగుతూ ఉంటే విటమిన్ 'సి' లోపం వల్ల వచ్చే చిగుళ్ళ వాపు మొదలైన లక్షణాలు గల 'స్కర్వీ' వ్యాధి సోకదు. రోజూ 350 గ్రాముల నిమ్మరసం సేవిస్తే 'గ్రహణి' (రక్తవిరేచనాలు) వ్యాధి నివారణ అవుతుంది. పప్పు, కూరలు, చారు మొదలైనవి ఉడికిన తరువాత వాటిలో నిమ్మరసం పిండితే అవి రుచికరంగా ఉండడమే కాక, తేలికగా జీర్ణం అవుతాయి. ఉదయం ఫలాహారానికి ముందు గాని, రాత్రి పడుకో బోయేటప్పుడు గాని వేడి నీళ్ళతో కలిపిన నిమ్మరసం సేవిస్తే విరేచనం సాఫీగా అవుతుంది. 4 గ్రాముల నిమ్మరసం, 4 గ్రాముల నీరు, 8 గ్రాముల చక్కెర కలిపి సేవిస్తే వాంతుల మీదా, అజీర్తి మీదా అది అమోఘంగా పని చేస్తుంది. నిమ్మరసంలో ఉప్పు, మిరియపు పొడి, ధనియాల పొడి కలిపి సేవిస్తే ఆకలి పెరుగుతుంది; సాఫీగా విరేచనం అవుతుంది.

నిమ్మరసంతో వెల్లుల్లిరసం కలిపి సేవిస్తే కీళ్ళవాతం నయం అవుతుంది. విటమిన్‌లను గూర్చి పరిశోధనలు జరిపిన కార్ల్ మ్యూలర్ అభిప్రాయం ప్రకారం నిమ్మకాయలో న్యుమోనియా వ్యాధిని కలిగించే 'న్యూమోకాకస్' అనే సూక్ష్మక్రిములను సంహరించే స్వభావం ఉంది. జలుబు మీద నిమ్మకాయ అమోఘంగా పని చేస్తుంది. ఆంటీ సెప్టిక్‌గా కూడా అది ఉపయోగపడుతుంది.

450 గ్రాముల పాలలో తగినంత నిమ్మరసం కలిపి సేవిస్తే మూలశంక రోగుల ఆసనం నుంచి రక్తం స్రవించడం బంద్ అవుతుంది.

100 గ్రాముల నిమ్మరసం, 150 గ్రాముల 'అక్వారోజ్', 150 గ్రాముల చక్కెర లేదా పటికి బెల్లం, 2 గ్రాముల మిరియపు పొడి, 6 గ్రాముల యాలకి పొడి కలిపి తయారు చేసిన సిరప్‌ను వాడకం వల్ల వికారం, వాంతులు, ఒళ్ళు నొప్పులు మొదలైన లక్షణాలు తగ్గుతాయి.

10 గ్రాముల నిమ్మ రసాన్ని 100 గ్రాముల ఆవనూనెతోనూ, 3 గ్రాముల కర్పూరం

## చెట్లెక్కే నక్క



అమెరికాలో ఎక్కువగా కనిపించే చెట్లెక్కే బూడిద రంగు నక్క కాయగూరలు ఎక్కువగా తింటుంది. నిటారుగా ఉన్న చెట్లను కూడా బలమైన తన గోళ్ళ సహాయంతో అది తేలికగా ఎక్కుతుంది. ఒక కొమ్మమీద నుంచి మరో కొమ్మమీదికి సునాయాసంగా దూకుతుంది. అడవి ద్రాక్షపళ్ళు, చెర్రీ పళ్ళు దీనికి మిక్కిలి ఇష్టం.

"ఆరోగ్యం 'ఆశ'ను చేకూరుస్తుంది;
'ఆశ' ఉన్న వాడికి అన్నీ ఉన్నట్టే!" —అరేబియన్ సామెత

తోనూ కలిపి ఒంటికి మర్దన చేసుకుంటే చర్మవ్యాధులు దగ్గిరికి రావు. ఒక వంతు నిమ్మ రసం, 2 వంతులు నీళ్లు కలిపి తయారు చేసిన పానీయం వివిధ వ్యాధులను తెచ్చి పెట్టే సూక్ష్మక్రిములను మన దరి జేరనీయదు. పళ్ళుజబ్బుల మీదా, చిగుళ్ళ వాపుల మీదా నిమ్మరసం అద్భుతంగా పనిచేస్తుంది. గుడ్డల మీది మరకలను తొలగించడానికి కూడా నిమ్మరసం పెట్టింది పేరు!

పోషకాహారం గానూ, ఔషధం గానూ నిమ్మరసం ఉపయోగపడా లంటే క్రమం తప్ప కుండా ప్రతిరోజూ దానిని ఉపయోగిస్తూ ఉండడం అవసరం. కనీసం రోజుకి ఒక పూర్తి నిమ్మకాయను తీసుకోవాలి. రోజూ అందుబాటులో ఉండేందుకు వీలుగా ప్రతి వారూ తమ పెరటిలో ఒక నిమ్మచెట్టు వేసు కోడం మంచిది. నిమ్మచెట్టుకి ఎండ ఎక్కువగా తగులుతూ ఉండాలి. గాలి తాకిడినుంచి రక్షణ ఉండాలి. నిమ్మచెట్టు వేళ్ళు బాగా లోతుకు చొచ్చుకొని పోవు. అందుచేత నిమ్మ చెట్టు చుట్టూ ఎన్నడూ త్రవ్వరాదు. అప్పు డప్పుడు ఈ చెట్లమీద నీళ్లు కలిపిన 'యూరియా సొల్యూషన్' చిమ్ముతూ ఉండడంమంచిది.

(20 వ పేజీ తరువాయి)

శాస్త్రీయ పరిభాషలో చెప్పా లంటే 'అక్యూట్ నానో ఫరింజైటిస్' అనాలి!

* * *

## పరుగు పందెంలో గుర్రంమీద గెలుపు:

1936 లో ఒక నీగ్రో క్రీడాకారుడు జెస్సీ ఓవెన్స్ 100 గజాల పరుగు పందెంలో ఒక పందెం గుర్రాన్ని ఓడించాడు.

* * *

## 'నరకం' అని రైలు స్టేషన్ ఉంటుందా?

నార్వేలోని ఒక రైలు స్టేషన్ పేరు 'హెల్' (నరకం)!

* * *

## 20 నిముషాల కో ఆత్మహత్య:

అమెరికాలో ప్రతి 20 నిముషాలకూ ఒక వ్యక్తి ఆత్మహత్యకు పాల్పడుతున్నాడు.

## జ్ఞాని అయినవాడే మహా పురుషుడు!




సుప్రసిద్ధ చైనా దార్శనికుడు కన్ఫ్యూషియస్‌ను మహా మనీషిగా గుర్తించి ఇప్పుడు ఆయన రచనలను శాస్త్రీయ పద్ధతిలో అధ్యయనం చేస్తున్నారు. ఆయన ఇలా అంటారు: "పుట్టుకతోనే జ్ఞానులైనవారు మానవులలో పై వర్గంవారు. అధ్యయనం వల్ల తేలికగా జ్ఞానం ఆర్జించే వారు తరువాతి శ్రేణి; చాలా కష్టపడి క్రిందా మీదా పడితే గాని జ్ఞానం అబ్బని వారు మూడో వర్గం; ఎంత గింజుకున్నా జ్ఞానం గడించలేని వారు అధమ వర్గం!"

"డబ్బు పెట్టి కొనలేని వస్తువు 'ఆరోగ్యం'!" -ఇజాక్ వాల్టన్

# విజ్ఞాన సర్వస్వం కథ

రా ఘ ంద్ర రా వు



[శ్రీ రాఘవేంద్రరావు ప్రస్తుతం బొంబాయిలోని సాహార్ అంతర్జాతీయ విమానాశ్రయంలో సీనియర్ ఏవియేషన్ సూపరింటెండెంట్‌గా పనిచేస్తున్నారు. ఆంగ్ల సాహిత్యంలో బి.ఏ. (ఆనర్స్) పరీక్ష పాసయారు. 1968 నుంచీ స్వచ్ఛంద రచయితగా వివిధ పత్రికలకు వ్యాసాలు వ్రాస్తున్నారు.]

ఒక జోక్ మీరు వినే ఉంటారు. బడిలో చదువుకుంటున్న ఒక కుర్రాడు ఒక రోజున "నాన్నా! నాకు ఒక ఎన్‌సైక్లోపీడియా (విజ్ఞాన సర్వస్వం) కొని పెట్టవూ?" అని తండ్రిని అడిగాట్ట. చిరాకుగా ఉన్న వాళ్ళ నాన్న "అదేం కుదరదు. నాలాగే నువ్వూ బడికి కాలినడకను వెళ్ళి చదువుకోవలసిందే!" అన్నాట్ట. ఎన్‌సైక్లోపీడియా అంటే అదేదో వాహనం అ కున్నాడు పాపం ఆ తండ్రి!

'ఎన్‌సైక్లోపీడియో' అన్న గ్రీక్ పదాని అర్థం—'జ్ఞానచక్రం' అని. కళలకూ, శాస్త్రాలకూ సంబంధించిన సమస్త విజ్ఞానాని అకారాది క్రమంలో వివరిస్తూ ఏ విషయాని గురించి తెలుసుకోవా లన్నా తేలికగా క్షణంలో సంప్రదించడానికి వీలైన రిఫరెన్స్ గ్రంథ ఎన్‌సైక్లోపీడియా లేక విజ్ఞాన సర్వస్వం!

ప్రపంచ రికార్డులను నమోదు చేసే గిన్ని గ్రంథాన్ని అనుసరించి ప్రపంచంలో మొ మొదటి విజ్ఞాన సర్వస్వాన్ని గ్రీక్ తత్త్వ వేత్త స్ప్యూసిపస్ (క్రీ.పూ. 370) సం

## రక్తంతో వ్రాసిన మత గ్రంథ

12 వ శతాబ్దంలో జపాన్ రాజు సుటో 3 ఏళ్ళ పాటు ప్రవాసంలో గడపవల వచ్చింది. ఆ కాలంలో ఆయన లంకావర (లంకావతార) సూత్రం అనే బౌద్ధమ గ్రంథాన్ని తన రక్తంలో ముంచిన కలంతో కాపీ చేశాడు. ఆ పుస్తకంలో 10,500 మా ఉన్నాయి. అలా చేస్తే బుద్ధుని దయవ తను తిరిగి జపాన్ రాజు కాగల డని ఆయ నమ్మాడు. 1144 లో సుటోకు మళ్ళీ అధి రానికి వచ్చి మరో 20 ఏళ్ళ పాటు రాజ్యం చేశాడు.

"పొరుగు వాణ్ణి ఒక్కణ్ణి ప్రేమించడం కంటె
మానవ జాతి నంతనూ ప్రేమించడం తేలిక!" —ఎరిక్ హాఫర్

లనం చేశాడు. ఈ స్ప్యూసిపస్ జగత్ప్రసిద్ధుడైన గ్రీక్ తత్త్వవేత్త ప్లేటో మేనల్లుడు.

మానవ రూపంలో ఉన్న విజ్ఞాన సర్వస్వం అని చెప్పదగ్గవాడు గ్రీక్ తత్త్వవేత్త అరిస్టాటిల్. సర్వ విజ్ఞానానికి నిధి అని ఆయన ప్రసిద్ధి పొందాడు. తర్కం, అతి భౌతిక శాస్త్రం, జంతు చరిత్ర మొదలైన పెక్కు శాఖలలో ఆయన ప్రవచించిన సూత్రాలే పాశ్చాత్య జగత్తులో 14వ శతాబ్దం దాకా మిక్కిలి ప్రాబల్యం వహించాయి.

ప్రపంచంలోని మిక్కిలి ప్రాచీన విజ్ఞాన సర్వస్వాలలో నేటికీ నిలిచి ఉన్న ఒక విజ్ఞాన సర్వస్వం 'ప్లినీ ది ఎల్డర్' అనబడే గయాస్ ప్లినియస్ సెకండాస్ సంకలనం చేసిన 'నేచురల్ హిస్టరీ'. 37 సంపుటాలలో 20,000 అంశాలను వివరించిన ఉద్గ్రంథం ఇది. 1163 లోనే ఇది మొదట అచ్చయినా దీని సంకలనం రోమన్ చక్రవర్తి టైటస్ ప్లేవియస్ వెస్పేసియన్ (క్రీ.శ. 69-79) కాలంలోనే జరిగింది.

మధ్య యుగాలలో యూరప్‌లో రెండు ఎన్‌సైక్లోపీడియాలు వెలిశాయి. ఒకటి: ఇసిడోర్ ఆఫ్ సెవిల్లీ కూర్చిన 'ఎటిమాలజీస్', రెండోది: విన్సెంట్ ఆఫ్ బ్యూవీయిస్ కూర్చిన 'స్పెక్యులమ్ మజుస్.' ఆధునిక విజ్ఞాన సర్వస్వానికి రూపకల్పన చేయడంలో ఈ రెండిటి ప్రభావం ఎక్కువగా ఉంది.

నమ్మండి, నమ్మకపోండి-సర్వ విజ్ఞానానికి నిధానంగా విజ్ఞాన సర్వస్వాన్ని మలచిన ఘనత చైనీయులది. చైనా చక్రవర్తులలో చాలామంది వివిధ రంగాలలో ఆరితేరిన విద్వాంసులు. 'కాంగ్-హి' అనే తొలి మంచూ వంశ చక్రవర్తి 'లై-షూ' అనే నూతన విజ్ఞాన సర్వస్వం తయారు చేయించాడు. చైనా నాగరకత ప్రాభవానికి అది దర్పణం లాంటిది. చియెన్‌లుంగ్ చక్రవర్తి హయాంలో 1726 లో ఇది మొదట ముద్రితమైంది. 5,020 సంపుటాలతో కూడిన ఈ బృహద్ గ్రంథం ఇప్పటికీ లండన్‌లోని బ్రిటిష్ మ్యూజియమ్‌లో ఉంది.

## మేలి రకం విమానం



'ఏ-310 బేబీ ఎయిర్ బస్' అసలు చప్పుడు చెయ్యదు. ఎగురుతున్నప్పుడు కదులుతున్నట్టే ఉండదు. ఎలాంటి ఆర్భాటం లేకుండా విమానాశ్రయంలో ఎప్పుడు దిగిందో కూడా తెలియకుండా దిగుతుంది. అత్యాధునికమైన 'సూపర్ సానిక్' రెక్కలు, పైలట్‌లు కూర్చునేందుకు పూర్తి ఎలెక్ట్రానిక్ కాక్‌పిట్, అత్యాధునిక తరానికి చెందిన ఇంజన్, సుమారు 210 సీట్లు కలిగి, 5,500 కి.మీ.ల దూరం పోగలిగిన ఈ విమానమే ఇప్పుడు ప్రపంచంలో మిక్కిలి ప్రశస్తమైంది.

"లోలోపల స్పందించే దివ్యత్వం వల్ల తప్ప లేకపోతే మానవత్వానికి విలువ ఏమిటి?"

-బేకన్

మంచూ వంశపు రాజులు గొప్పవారే గాని, వారికి ముందు పాలించిన మింగ్ వంశపు రాజులు తక్కువ తిన్నవారేమీ కారు. మింగ్ వంశపు చక్రవర్తి 'యూంగ్-లో' (1403-25) కాలంలో యూంగ్-లో-టా-టీన్' అనే బృహద్ విజ్ఞాన సర్వస్వ సంకలనానికి పూనుకున్నారు. 2,000 పైచిలుకు విద్వాంసులను ఆ పనిలో చక్రవర్తి నియమించాడు. మొత్తం 22,937 వ్రాత సంపుటాల గ్రంథం ఇది. అయితే ఆ సంపుటాలలో 370 మాత్రమే ఇప్పుడు లభిస్తున్నాయి. మొత్తం గ్రంథం అచ్చులో 9,00,000 పుటలు అవుతుంది. అంటే ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా కంటె 15 రెట్లు పెద్దదన్న మాట!

ఫ్రాన్స్‌లో కూడా ఎన్‌సైక్లోపీడియా ఉద్యమం కొనసాగింది. డెడెరో (1713-34), డలెంబర్ట్ వంటి ఫ్రెంచ్ విజ్ఞానులు ఫ్రెంచ్ ఎన్‌సైక్లోపీడియాలోని వ్యాసాలలో ఎక్కువ భాగం స్వయంగా వ్రాయడమే కాక, వోల్టేర్, రూసో, మాంటెస్క్యూ, టిర్గాట్ వంటి మహామహుల చేత కూడా దానిలో వ్యాసాలు వ్రాయించారు. వారందరూ యూరప్ దేశాల భావధారపై అధిక ప్రభావం చూపిన మహా విజ్ఞానులు. 1750 లో ఈ ఎన్‌సైక్లోపీడియా రచన ప్రారంభం అయింది. 1765 నాటికి 17వ సంపుటం వెలువడింది. 1789 లో జరిగిన ఫ్రెంచ్ విప్లవానికి ఈ ఎన్‌సైక్లోపీడియా ఎంతో దోహదం చేసిందని చరిత్రకారులు భావిస్తున్నారు.

ఇంక-ఈనాడు వాడుకలో ఉన్న ఎన్‌సైక్లోపీడియా లన్నిటిలోకీ మిక్కిలి సమగ్రమైనది

## జగద్విఖ్యాతి పొందిన చిత్రం - మోనాలిసా



జగద్విఖ్యాతి పొందిన 'మోనాలిసా' చిత్రం పెయింటర్ లియోనార్డో డా విన్సీ కళాకారుడే కాదు; గణిత శాస్త్రవేత్త, ఖగోళవేత్త, భూగర్భవేత్త, జీవశాస్త్రవేత్త కూడా! 1452 లో ఫ్లారెన్స్ (ఇటలీ) సమీపాన జన్మించిన లియోనార్డో బళ్లో చదువుకునే రోజుల్లోనే తన టీచర్లను కూడా తికమక పెట్టే లెక్కలు అవలీలగా చేసి వేసేవాడు. 30 ఏళ్ళు దాటిన తరువాత ఆయన చిత్రలేఖనం మొదలుపెట్టి 'లాస్ట్ సప్పర్', 'మోనాలిసా' వంటి విశ్వ విఖ్యాతి పొందిన చిత్రాలు చిత్రించాడు. ఆయన నోట్‌బుక్‌ల నిండా ముందు ముందు శాస్త్రవేత్తలు నిర్మించనున్న విమానం, హెలికాప్టర్, జలాంతర్గామి వంటి చిత్రాలు గీసేవాడట!

"గాజు ఇళ్ళలో ఉండేవారు పరుల ఇళ్ళ మీదికి రాళ్ళు రువ్వ రాదు!" —ఇంగ్లీష్ సామెత

గానూ, ప్రామాణికమైనదిగానూ పరిగణించబడుతున్న 'ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా' ను గూర్చి తెలుసుకుందాము. కార్యదక్షులైన ఇద్దరు స్కాచ్ దేశీయులు ఆండ్రూ బెల్, కాలిన్ మెక్ ఫార్కుహార్ అనేవారు 1768లో ఎలాంటి ఆర్భాటం లేకుండా దీనికి అంకురార్పణ చేశారు. ఆ ఇద్దరిలో ఒకరు బ్లాక్ మేకర్, మరొకరు ప్రింటర్. ఇద్దరూ రచయితలు కారు. మొదటి సంపుటం అంతా ఇంచుమించు ఒక్క చేతిమీదుగా వ్రాసిన విలియమ్ స్మెల్లీ-విస్కీపట్ల ఆతని ప్రీతిని పట్టించుకోకపోతే-నానా విషయ పరిజ్ఞానం గలవాడు అని ఒప్పుకోక తప్పదు.

అయితే-ఇంగ్లీష్‌లో అకారాది క్రమంలో వచ్చిన మొట్టమొదటి విజ్ఞాన సర్వస్వం 'ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా' కాదు. రాయల్ సొసైటీ ప్రథమ కార్యదర్శి జాన్ హారిస్ 1704 లో ప్రచురించిన 'లెక్సికన్ టెక్నికమ్' కు ఆ ఘనత దక్కుతుంది. ఆ తరువాత 1728 లో ఎఫ్రేయిమ్ ఛాంబర్స్ 'ఛాంబర్స్ సైక్లోపీడియా' ప్రకటించాడు. అది మిక్కిలి ప్రజాదరణ పాత్రమై పలు ముద్రణలు పొందింది.

ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా ప్రథమ ముద్రణ 1771 లో 2,659 పుటలతో 3 సంపుటాలుగా వెలువడింది. 40 ఏళ్ళలో అది 16,033 పుటలతో కూడిన 20 సంపుటాలు అయింది. ప్రస్తుతం బ్రిటానికా 33,141 పుటలుగల 30 సంపుటాల గ్రంథం. దానిలో 4,30,00,000 ఎంట్రీలు ఉన్నాయి. 4,277 మంది విద్వాంసులు వ్రాసిన వ్యాసాలు అవి. ఇప్పుడు—దాని సంపాదన కార్యం చికాగోలోనూ, లండన్‌లోనూ కొనసాగుతూంది.

ఫ్రాన్స్, జర్మనీ, ఇటలీ, సోవియెట్ రష్యాలలో కూడా విజ్ఞాన సర్వస్వాలు ఉన్నా, ఇప్పటికీ ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికాయే ప్రపంచం నలుమూలల గల సుప్రసిద్ధ విద్వాంసుల రచనలతో కూడిన ప్రామాణిక గ్రంథంగా ఆదరించబడుతూంది.

## సూర్యుణ్ణి గూర్చిన విశేషాలు



సూర్యగోళం వ్యాసం దాదాపు 8,65,000 మైళ్ళు. ప్రకృతి సిద్ధమైన 'హైడ్రోజన్ ఫ్యూజన్ రియాక్టర్' సూర్యుడు. దాని ఉపరితల విస్తీర్ణం 23,17,70,00,00,00.00,00,00,00,000 చ.గ. లు. ప్రతి ఒక చదరపు గజం మేర నుంచీ సుమారు 80,000 అశ్వశక్తి నిరంతరాయంగా వెలువడుతూ ఉంటుంది. భూమి మీద ప్రతి అంగుళం మేర ప్రతి నిముషం 3/10 కేలరీల శక్తి ప్రసరిస్తూంది. ఇది ఒక గ్రాము నీటి ఉష్ణోగ్రత ఒక డిగ్రీ సెంటిగ్రేడ్ పెరగడానికి అవసరమైన శక్తితో సమానం.

---

"పక్కులకు బొరియ లున్నాయి; పక్షులకు గూళ్ళున్నాయి;
మనిషికే తల దాచుకునే ఆశ్రయం లేదు!" — న్యూ టెస్టమెంట్

# బహుమతి పొందిన వ్యాసం

## ఆదర్శవాది

వారణాసి పాపయ్య శాస్త్రి,
విజయనగరం.

ఒక ఆశయాన్ని ఆదర్శంగా గ్రహించి, దానికోసం తను ధన, మనః, ప్రాణాలను గడ్డిపోచ వలె త్యజించి నిలిచిన మేరు నగ ధీరులను ఆదర్శవాదులు అనవచ్చును. ఆ ఆశయం విశ్వజనీనమై, విశ్వశ్రేయస్సును కలిగించేదై ఉండాలి. స్వార్థానికి తావీయ కుండా పరార్థప్రవణమై ఉండాలి.

దుష్ట చతుష్టయంలోని వాడైనా కర్ణుడు ఆదర్శవాది. ఆత్మ ప్రబోధాను గుణంగా వీర మరణం పొందినవాడు; స్వామి ద్రోహానికి పాల్పడనివాడు. జనకుడు మరొక ఆదర్శ వాది. అష్టైశ్వర్యాలతో తులతూగుతున్నా నిర్లిప్తుడుగా, జీవన్ముక్తుడుగా మనిషి జీవించ గల డని నిరూపించినవాడు.

సోక్రటీసుతో పాటు ఏసు ప్రభువును, బుద్ధ భగవానుని, గాంధీ మహాత్ముని స్మరిస్తే ఆదర్శవాదులలో అగ్రగణ్యులను స్మరించినట్టు అవుతుంది. సత్యాన్ని నిర్భయంగా బోధించి, అందుకు ఫలంగా విషం త్రాగి అసువులు వీడిన సోక్రటీసు గొప్ప ఆదర్శవాది. ఈ లోకంలోని ప్రభువుల శాసనాలను కాక అంత రాత్మ ద్వారా వ్యక్తమయ్యే దైవ శాసనాలను పాటించ మని బోధించిన ఏసుప్రభువు కూడా ఆదర్శవాదే. బుద్ధభగవానుడు, అమెరికాలో బానిసత్వాన్ని నిర్మూలించడానికి కృషిచేసిన

---

### మొదటి టెస్ట్ ట్యూబ్ బేబీ



ప్రపంచంలో మొట్ట మొదటి టెస్ట్‌ట్యూబ్ బేబీ లూయీ బ్రౌన్. ఇటీవల పాశ్చాత్య దేశాలలో దాతలు ఇచ్చిన ఇంద్రియంతో కృత్రిమ గర్భోత్పత్తి చేసే ప్రక్రియకు ప్రజా దరణ ఎక్కువగా లభిస్తూంది. కాని అలా పుట్టిన శిశువుకి ఔరస జనకుడు ఎవరో నిర్ణ యించడం పెద్ద సమస్య.

“మహనీయులు చరిత్రను సృష్టించరు;
చరిత్రే మహాపురుషులను మలుస్తుంది.” -స్టాలిన్

అబ్రహాం లింకన్ కూడా ఆదర్శవాదులుగా పేర్కొనదగినవారు.

తన ఆశయాలను ప్రత్యక్షంగా ఆచరణలో పెట్టి చూపిన బాపూజీ వంటి ఆదర్శవాదులు ఎప్పుడో కాని ఉదయించరు. ఆయనకు రాజకీయ వారసుడు నెహ్రూ: ఆధ్యాత్మిక వారసుడు వినోబా భావే!

నిజమైన ప్రతి కమ్యూనిస్టూ ఒక ఆదర్శవాదే! కమ్యూనిస్ట్ సిద్ధాంత ప్రవక్త కార్ల్ మార్క్స్ మహనీయుడు. ఆయన బోధించిన సమ సమాజ స్థాపనకు కృషి చేస్తూ, రష్యాలో లెనిన్, చైనాలో 'మావో', వియెత్నాంలో 'హోచిమిన్', క్యూబాలో 'కాస్ట్రో' యుగోస్లావియాలో 'మార్షల్ టిటో' వంటి మహనీయులెందరో ఆదర్శవాదులుగా ప్రసిద్ధి పొందారు.

ఆదర్శవాదుల జీవితాలు నిత్యశోధనతో, సాధనతో కూడి ఉంటాయి. సామాన్యులకు అవి అవగతం కావు. లోకానికి అవి మహోపకారం చేస్తాయి. జ్యోతి తాను కాలిపోయి లోకానికి వెలుగును ప్రసాదించినట్లు ఆదర్శవాదులు తమ సర్వస్వం త్యాగం చేసి విశ్వశ్రేయస్సును సాధిస్తారు: మానవ చరిత్రలో ధ్రువతారలుగా ప్రకాశిస్తారు!

* * *

పి. ఆర్. మందేశ్వర రావు,
సికిందరాబాదు.

కొందరు వ్యక్తులు చేసే పనులను పదిమంది ఆమోదించి అనుసరిస్తారు. వ్యక్తిపరంగా కాక సంఘపరంగా ఆలోచిస్తూ సామాజిక న్యాయాన్ని కాపాడే అలాంటి వ్యక్తులనే ఆదర్శవాదులు అంటారు.

ఆఫీసుకు వేళకు హాజరు కావడం మొదలు, అవినీతి గుండెకు తుపాకీ గురిపెట్టడం దాకా ఆదర్శానికి ఎన్నైనా ఉదాహరణలు చెప్పుకోవచ్చు. నిజమైన ఆదర్శవాదులు సమ సమాజ స్థాపనకు కృషి చేస్తారు. తమ ఆశయాల వెలుగును దేశమంతటా ప్రసరింప జేస్తారు. ఒకప్పుడు మహాత్మా గాంధీ, రాజా రామమోహన్ రాయ్‌ల వంటివారు ఆదర్శవాదులు అయితే, ప్రస్తుత కాలంలో 'మదర్ థెరీసా' వంటి సంఘ సేవకులు ఆదర్శప్రాయులుగా

## కంప్యూటర్‌తో నడిచే మొదటి ఓవర్ హెడ్ రైలు



నగరం పైభాగంలో విద్యుచ్ఛక్తి సాయంతో నడిచే 'సిటీ లిఫ్ట్' అనే రైలును ప్రయోగాత్మకంగా రెండేళ్ళ పాటు డార్ట్‌మండ్ యూనివర్సిటీ కాంపస్‌లో నడుపుతున్నారు. 250 మంది ప్రయాణీకులను 7 కి.మీ ల దూరం 15 ని. ల కాలంలో ఈ రైలు చేరవేసుంది.

---

"ఉద్ధరే దాత్మనా ఆత్మానం"
(తనంతట తనే శ్రమించి పైకి రావాలి!) -భగవద్గీత

మన్ననలు పొందుతున్నారు. సమానత్వం కోసం ప్రాణాలను సయితం లెక్కచేయకుండా తుపాకీ చేత బట్టిన విప్లవకారులూ, మతం పేరిట జరిగే దోపిడీలను బట్టబయలు జేసే హేతువాదులూ, మత వివాదాలనూ, ద్వేషాలనూ అంతమొందించే శాంతమూర్తులూ అందరూ ఆదర్శవాదులే!

రేడియో ప్రసంగాలలో, పత్రికా వ్యాసాలలో ఆదర్శాలు బోధించే చాలా మంది పెద్దలలో ఆచరణ శూన్యం. 'కులాంతర, మతాంతర వివాహాలు ప్రోత్సహించండి!' అంటూ ఉపదేశించేవారు తమ పిల్లల విషయంలో మాత్రం అందుకు సమ్మతించరు. నిజమైన ఆదర్శవాదులు ఎన్ని కష్టాలు ఎదురైనా తమ ఆదర్శాలను ఆచరణలో పెడతారు.

పల్లెలు దేశానికి వెలుగులు. పల్లెల అభ్యుదయానికి కంకణం కట్టుకోడం, దేశంలో దారిద్ర్య నిర్మూలనానికి దీక్షబూనడం, మూఢ నమ్మకాలకూ, మతంపేరిట జరిగే దోపిడీలకూ స్వస్తిజెప్పి, నిరక్షరాస్యత, లంచగొండితనం, ఆకలి, అవినీతి—వీటిని నిర్మూలించడం నేటి యువతకు ఆదర్శం కావాలి!

* * *

ఆర్. జయకుమార్, చిత్తూరు.

'చేతకన్న హెచ్చు దాత లేదు' అన్నాడు ప్రజాకవి వేమన. మనిషి మాటకు విలువనిచ్చేదీ, మానవ జీవితానికి మదింపు కట్టేదీ మనిషి ఆచరణ. ఆలోచన, మాట, చేత ఈ మూడూ ఒకటైనప్పుడు మనిషి జీవితం పవిత్రమైన త్రివేణీ సంగమం అవుతుంది. త్రికరణ శుద్ధి కలిగిన మనిషే ఆదర్శమూర్తిగా ఆరాధించబడతాడు. మానవ చరిత్రను ఆదర్శవాదులే అగ్రగాములై ముందు నడిపారు. చెప్పిన మాటను ఆచరించి చూపిన మహాత్ముడు మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ వివేకానందుడు హిందూ మత ప్రాశస్త్యాన్ని అమెరికాలో జరిగిన విశ్వ మత మహాసభలో వివరించి భారతీయుల ఆధ్యాత్మిక చింతనను ప్రపంచం అంతటా ప్రసరింపజేశాడు. కందుకూరి వీరేశలింగం పంతులు సంఘ సంస్కరణకు పూనుకొని అశేష ఆంధ్ర ప్రజలకు ఆదర్శప్రాయు డయాడు. మానవ జీవితానికి ఒకే లక్ష్యం లోక కల్యాణం, విశ్వశ్రేయస్సు ప్రజా సంక్షేమం. మనిషి మనీషిగా మారాలి. అట్టడుగున ఉన్న మానవుడు అత్యద్భుత

(మిగతా 38 వ పేజీలో)

## మిక్కిలి పెద్ద పూలదండ



10 వేల పువ్వులతో కట్టిన మిక్కిలి పెద్ద పూలదండను ప్రస్తుతం జమైకా (అమెరికా)లో ఉంటున్న భారత యోగి చిన్మోయ్ 10,000 పద్యాలు పూర్తి చేసిన శుభ సందర్భంలో ఆయన మెడలో వేశారు.

# స్పాట్ లైట్

## ...న్‌వెల్త్ రాజ్యాధినేతల సభ

డా॥ డి. ఆంజనేయులు

...టీవల భారత రాజధాని న్యూఢిల్లీలో మహా వైభవంగా జరిగిన, ప్రపంచ వ్యాప్తంగా ...శేష ప్రచారం పొందిన అంతర్జాతీయ సభ ...లో 'కామన్‌వెల్త్ రాజ్యాధినేతల సభ' (CHOGM-Common Wealth Heads ...f Government Meet) ఒకటి. గత ...వంబరు మాసంలో జరిగిన ఈ సభ తాలూకు ...శేషాలకూ, చిత్రాలకూ ఇండియాలోని ...న్ని భాషల పత్రికలూ అధిక ప్రాధాన్యం ...చ్చి ప్రచురించాయి.

ఈ 'చోగ్మ్' (CHOGM) ఎప్పుడు ఎలా ...ర్పడింది, దాని క్రమ పరిణామం, అది ...ని చేసే తీరూ, అంతర్జాతీయ రాజకీయ ...ంగంలో దాని ప్రాధాన్యం ముఖ్యంగా తెలు ...కో దగ్గవి.

'కామన్‌వెల్త్' అనే మాట ఆంగ్ల సాహి ...త్యంలో షేక్స్‌పియర్ వ్రాసిన 'ది టెంపస్ట్' ...నే నాటకంలోనే మొదట మనకు కనిపి ...ంది. అయితే — ఆ నాటకంలోని ...ంజోలో కామన్‌వెల్త్' ఒక ఆదర్శ ...ాయమైన రాజ్యం. కవి భావనా కల్పితం. ...స్తవిక జగత్తులో — స్టువార్ట్ వంశపు

### 12 ఏళ్ళకొకసారి పూసే కురుంజి మొక్క



...ద. భారత దేశంలో కొండ చరియలలో తరచుగా కనిపించే కురుంజి మొక్క 12 ఏళ్ళకొకసారి పూలు పూస్తుంది. అయితే దీనిలో వేర్వేరు రకాలకు పూలు పూసే ఋతువులు వేర్వేరు విధాలుగా ఉన్నాయి. కురుంజి పువ్వు పెద్ద సైజు ఆవ పువ్వంత ఉంటుంది. వాటిలో తేనె జాస్తి. అందుకే ఆ పూల చుట్టూ జుమ్మంటూ ఎప్పుడూ తేనె టీగలు ముసురుకుని ఉంటాయి.

...ద్ధి పెరుగుదాన్ని చూడలేనట్లే చరిత్ర గతిని మనం చూడలేము." — బోరిస్ పాస్టర్‌నాక్

రాజు మొదటి ఛార్లెస్‌ను ఉరితీసిన అనంతరం ఇంగ్లండ్ భవితవ్యానికి ఆలివర్ క్రాంవెల్ (1599-1658) ప్రధానమైన ఏడుగడగా ఉన్న రోజులలో 1649 మే 19 న ఇంగ్లండ్‌ను 'కామన్‌వెల్త్' రాజ్యంగా, అంటే రాజు పెత్తనం లేని స్వతంత్ర ప్రజా రాజ్యంగా ప్రకటించిన సందర్భంలోనే మొట్టమొదటి సారిగా ఈ మాట ప్రస్తావన కనిపిస్తుంది. అయితే ఆ 'కామన్‌వెల్త్' మూణ్ణాళ్ళ ముచ్చటే అయింది.

గ్రేట్ బ్రిటన్, దాని అధినివేశ రాజ్యాలూ, ఇతర ప్రాంతాలూ కలిపి ఒక 'కామన్‌వెల్త్ ఆఫ్ నేషన్స్' గా ఏర్పడా లన్న ప్రతిపాదన మొదట 1926 లో జరిగిన ఇంపీరియల్ కాన్ఫరెన్స్‌లో ఆమోదించబడింది. 1931 లో 'ది శ్టాట్యూట్ ఆఫ్ వెస్ట్ మినిస్టర్' అధినివేశ రాజ్యాల ప్రతిపత్తిని గుర్తిస్తూ, బ్రిటిష్ సింహాసనంతో అధినివేశ రాజ్యాల సంబంధాన్ని నిర్వచించింది. బ్రిటిష్ సామ్రాజ్యంలోని ఇతర ప్రాంతాలకు కూడా సంపూర్ణ స్వపరిపాలన హక్కు ఏర్పడగానే ఈ కామన్‌వెల్త్‌లో సభ్య రాజ్యాలుగా చేరే అధికారం కూడా అందులో కల్పించబడింది.

1947 లో బ్రిటిష్ మంత్రివర్గంలోని 'సెక్రటరీ ఆఫ్ స్టేట్ ఫర్ డొమినియన్స్' అనే పదవి రద్దయి, దాని స్థానే 'సెక్రటరీ ఆఫ్ కామన్‌వెల్త్ రిలేషన్స్' అనే పదవి కల్పించబడింది.

ఆ విధంగా రూపు దాల్చిన కామన్‌వెల్త్ తాలూకు కార్య కలాపాల నిర్వహణకు ఒక లిఖిత 'సంవిధానం' (constitution) అంటూ ఏదీ లేదు. దానిలోని సభ్య రాజ్యాలకు సంపూర్ణ స్వాతంత్ర్యం ఉంది. ఒకరు ఎక్కువ, మరొకరు తక్కువ అనే తేడాలు లేకుండా సమాన హోదాతో బ్రిటన్‌తో కలిపి అవి పనిచేస్తాయి. కెనడా, ఆస్ట్రేలియా, న్యూజీలండ్ వంటి కొన్ని సభ్య రాజ్యాలు మాత్రం ఇంగ్లండ్ రాణిని తమకు కూడా అధినేత్రిగా గుర్తిస్తూ, ఆమె నియమించే గవర్నర్ జనరల్‌ను ఆమె ప్రతినిధిగా ఆమోదించాయి. ఇండియా, శ్రీలంక వంటి

## కేరళలోని న్యూస్‌ప్రింట్ ఫాక్టరీ ప్రత్యేకత



కొట్టాయం సమీపం లోని వెల్లూరు (కేరళ)లో ఏటా 80,000 టన్నుల న్యూస్ ప్రింట్ తయారు చేయడానికి నెలకొల్పబడిన 'ది హిందూస్థాన్ పేపర్ కార్పొరేషన్' మిల్లులో మాలిన్యాలు చేరకుండా అరికట్టే పరికరాలు అమర్చబడ్డాయి. రూ. 158 కోట్ల వ్యయంతో స్థాపించిన ఆ మిల్లు యూకలిప్టస్ కలపనీ, రెల్లుగడ్డినీ మాత్రమే 'గుజ్జు' (pulp) తయారు చేయడానికి వాడుతుంది.

"పది మందితో చావు పెళ్ళి లాంటిది!" — తెలుగు సామెత

దేశాలు తమ రాజ్యాధినేతలైన రాష్ట్రపతులను తామే ఎన్నుకున్నాయి. బ్రిటిష్ రాణిని కామన్‌వెల్త్ రాజ్యకూటమి అధినేత్రిగా మాత్రమే అవి గుర్తిస్తాయి.

కామన్ వెల్త్ సభ్య రాజ్యాలు ఒక దానిలో ఒకటి రాయబారులను (ambassodors) కాకుండా 'హై కమీషనర్'లను నియమించుకుంటాయి,



ఎస్. ఎస్. రాంఫల్

కామన్ వెల్త్ రాజ్యాధినేతల సభకు మొట్టమొదటి సెక్రటరీ జనరల్ కెనడాకు చెందిన ఆర్నాల్డ్ స్మిత్. అయిదేసి సంవత్సరాల గడువు గల రెండు టరమ్‌ల పాటు ఆయన ఆ పదవిని నిర్వహించారు 1975 లో ఆయన అనంతరం శ్రీదత్ సురేంద్ర నాథ్ రాంఫల్ సెక్రటరీ జనరల్ అయారు. అంతకు ముందు ఆయన 'గయానా' రాజ్యం విదేశాంగ మంత్రిగానూ, న్యాయశాఖామాత్యులుగానూ పని చేశారు. ఇప్పుడు ఆయన 3 వ టరమ్‌కు తిరిగి ఎన్నిక అయారు.

ప్రస్తుతం కామన్ వెల్త్ రాజ్య కూటమిలో 48 సభ్య రాజ్యాలు ఉన్నాయి. వీటిలో 44 రాజ్యాలు న్యూ ఢిల్లీలో జరిగిన సభలో పాల్గొన్నాయి. వీటిలో బ్రిటన్, కెనడా, ఆస్ట్రేలియా వంటి బాగా అభివృద్ధి చెందిన రాజ్యాలు మొదలు ఇప్పు డిప్పుడే అభివృద్ధి చెందుతున్న సాలమన్ దీవులు, సెంట్ విన్సెంట్, సెయికిలీజ్‌ల దాకా అనేక రకాల రాజ్యాలు ఉన్నాయి. కొన్ని ప్రజాస్వామిక రాజ్యాలైతే, మరి కొన్ని రాజరిక వ్యవస్థ గలవి. కొన్ని మరీ పెద్దవైతే, మరి కొన్ని మరీ చిన్నవి. తెల్లవారు, నల్లవారు మొదలైన వివిధ వర్ణాల జాతులు ఈ రాజ్య కూటమిలో ఉన్నారు.

కామన్‌వెల్త్ రాజ్యకూటమిలోని 48 సభ్య రాజ్యాలలోనూ 28 రాజ్యాలకు అలీన రాజ్య కూటమిలో కూడా సభ్యత్వం ఉంది. కామన్ వెల్త్ రాజ్యాధినేతల సభకు నిర్ణీతమైన ఒక ఎజెండా గాని, ముందుగా తయారు చేసుకున్న ఉపన్యాసాలు గాని లేవు. ఇష్టాగోష్ఠి సంభాషణల కోసం, వివిధ రాజ్యాల మధ్య సన్నిహిత మైత్రి ఏర్పడడం కోసం ఉద్దేశించిన

## ప్రపంచంలో మిక్కిలి పెద్ద సేన గల దేశం చైనా

ప్రపంచంలో ఏ దేశానికీ లేనంత పెద్ద సైన్యం చైనాకు ఉంది. 1980 లో చైనా సైన్యంలో 36 లక్షల మంది సైనికు లున్నారు. ఆ ఏడాది రష్యన్ సైన్యంలో ఉన్నవారు 18.25 లక్షల మందే!

"నరకంలో అన్నిటికన్నా గొప్ప యాతన అక్కడ చావు లేకపోవడం!" —జాన్ వెబ్‌స్టర్

సభ ఇది. ఎలాంటి సంకోచాలూ లేకుండా అన్ని సమస్యలూ యథేచ్ఛగా దీనిలో చర్చకు వస్తాయి. ఇండియాలోని గోవాలో ఏర్పాటు చేసిన విశ్రాంతి స్థావరాల (retreat) వంటివి 1973 నుంచీ ఈ కామన్ వెల్త్ రాజ్యాధినేతల సభలో ఒక అవశ్యక భాగంగా రూపొందాయి.

న్యూ ఢిల్లీ సమావేశంలో చర్చకు వచ్చిన ప్రధాన సమస్యలలో కొన్ని:

1. మీడియమ్ రేంజ్ పరమాణు క్షిపణుల (nuclear missiles) ఉత్పత్తిని పరిమితం చేసేందుకు రష్యా అమెరికాల మధ్య చర్చలను జనీవాలో తిరిగి ప్రారంభించడం;

2. గ్రెనెడా, లెబనాన్‌లలో విదేశీ సైన్యాల ఉనికి, చిన్న రాజ్యాల భద్రత;

3. అంతర్జాతీయ ఆర్థిక రంగం సమీక్ష, పేద దేశాలకు ఇంకా ఎక్కువ ఉదారంగా ఋణాలు మంజూరు చేయడం;

4. అంతర్జాతీయ ద్రవ్య విధానాన్ని సంస్కరించేందుకు గల అవకాశాలు.

విస్పష్టమైన నిర్ణయా లేవీ ఈ సభలో తీసుకోడం జరుగలేదు. కాని, గ్రీక్ సైప్రియాట్‌లు ఏకపక్ష స్వాతంత్ర్యాన్ని ప్రకటించడం వల్ల ఉత్పన్నమైన సమస్యను పరిశీలించి, ఆ ద్వీప రాజ్యం అఖండతను కాపాడేందుకు ఐక్యరాజ్య సమితికి తగు సూచనలు చేసేందుకు గాను ఒక కమిటీ నియమించబడింది.

కొన్ని నెలల వ్యవధానంలోనే అలీన రాజ్యకూటమి, కామన్ వెల్త్ రాజ్యకూటముల సమావేశాలను భారత రాజధాని నగరంలో జరపడం శాంతి కాముకుడైన భారత ప్రథమ ప్రధాని పండిత జవహర్‌లాల్ నెహ్రూ పవిత్ర స్మృతికి చక్కని కానుక!

ఢిల్లీలోని విజ్ఞాన భవన్‌లో 'కామన్ వెల్త్' రాజ్యాధినేతల సభ జరపడానికి అయిన ం సుమారు రూ. 47 కోట్లు.

వెనుకటి కామన్ వెల్త్ రాజ్యాధినేతల సభలు ఒట్టావా (1973), సింగపూరు (1976), లుసాకా (1980) లలో జరిగాయి. అంతకు పూర్వం కామన్ వెల్త్ రాజ్యాల ప్రధాన మంత్రులు మాత్రమే లండన్‌లో సమావేశం అవుతూ వచ్చారు. ఈ సారి జరిగే 'కామన్ వెల్త్ రాజ్యాధినేతల సభ' 1986 లో నాసౌ (బహామాస్) లో జరుగుతుంది.

## ఇండియా జల సంపద



దేశం అంతటా 1.5 అ.ల లోతు వ్యాపించ గలిగినంత జల సంపద ఇండియాకు ఉంది. దీనిలో సగ భాగం గంగా బ్రహ్మపుత్ర నదుల వల్ల లభ్యం అవుతూంది.

"మానవ చరిత్రను నిర్ణయించేది ఆకాశంలోని గ్రహాల చలనాలు కాదు; మానవ హృదయాలలో వచ్చే మార్పులు!" —సర్ ఆర్థర్ కీత్

# నవభారత నిర్మాతలు

## ఘనశ్యామ్ దాస్ బిర్లా

**89** ఏళ్ళ పూర్ణాయుర్దాయం జీవించి, 1983 జూన్ 11న లండన్‌లో తుదిసారి కన్ను మోడ్చిన శ్రీ ఘనశ్యామ్ దాస్ బిర్లా ఇండియా



వాణిజ్య జగత్తులోనూ, గాంధీజీ సన్నిహిత సహచరులుగా భారత రాజకీయ రంగంలోనూ సుప్రసిద్ధులు. బిర్లా పేరు వినని వారు ఇండియాలో ఎవ్వరూ ఉండరు. నియమబద్ధమైన జీవితం గడుపుతూ మూడు, నాలుగు దశాబ్దాల పాటు భారతీయ వాణిజ్యాకాశంలో ధ్రువతారగా వెలిగిన బిర్లా ప్రమాదాలకు భయపడకుండా చేతికి అంది వచ్చిన ప్రతి అవకాశాన్నీ సద్వినియోగించుకొని, అక్షరాలా లక్షలు కొంఘం అట్టడుగు అంతస్తునుంచి అంతర్జాతీయ విఖ్యాతి స్థాయికి ఎదిగిన మహా వ్యక్తి!

రాజస్థాన్ రాష్ట్రంలో ఒక మారుమూల కుగ్రామం పిలనీలో 1894 ఏప్రిల్ 5న జన్మించారు ఘనశ్యామ్ దాస్ బిర్లా. స్కూళ్ళలో చదువుకొన్న చదువు ఇంచుమించు శూన్యం! ఆయన తండ్రి రాజా బలదేవ్ దాస్ బిర్లా కలకత్తాలో ఎగుమతి, దిగుమతుల వ్యాపారంలో పైకి వచ్చారు. ఘనశ్యామ్ దాస్ తన 12వ ఏటనే సంపాదన ప్రారంభించారు. 16వ ఏట స్వతంత్రంగా వ్యాపారం చేయడం మొదలుపెట్టారు.

ప్రథమ ప్రపంచ సంగ్రామ కాలం

---

### వారపత్రిక వెల రూ. 500 లు!

ప్రపంచంలో మిక్కిలి ఖరీదైన వారపత్రిక 'ది వాల్ స్ట్రీట్ ట్రాన్స్‌పోర్ట్.' ఈ జనవరి నుంచి దీని ఖరీదు 30 డాలర్ల నుంచి 50 డాలర్ల (సుమారు రూ. 500) కు పెంచుతున్నట్టు పత్రిక సంపాదకులు రిచర్డ్ ఆల్మాన్ ప్రకటించారు. ప్రపంచం అంతటా 6,100 కాపీలు చెల్లుతున్న ఈ పత్రిక కాపీని సగటున 8 మంది పాఠకులు చదువుతున్నారట!

(1914-1918) లో శ్రీ ఘనశ్యామ్ దాస్ తన ముగ్గురు తమ్ముళ్ళనూ కలుపుకొని సాహసంగా పారిశ్రామికోత్పత్తి రంగంలో అడుగు పెట్టారు. 1919 లో వారు నలుగురూ కలిసి 'బిర్లా బ్రదర్స్' అనే సంస్థను స్థాపించారు. క్రమేణ నిరంతర కృషితో బ్రహ్మాండమైన ఒక వాణిజ్య సామ్రాజ్యం వారు నెల కొల్పారు. 1981 లో వారి ఆస్తుల మొత్తం విలువ రూ. 2161.55 కోట్లు; సాలీనా ఉత్పత్తి: రూ. 1691 69 కోట్లు; పన్నులు పోను నికర లాభం: రూ. 110.42 కోట్లు. ఐశ్వర్యం దృష్ట్యా ఇండియాలో 'తాతా' ల (Tatas) తర్వాత చెప్పుకోవలసిన వారు 'బిర్లా' లే! వారి సంస్థ క్రమంగా వస్త్రాలు, సిమెంట్, చక్కెర, టీ, సైకిళ్ళు, కార్లు, అల్యూమినియమ్ మొదలైన ఎన్నో వస్తువులను ఉత్పత్తి చేయడానికి పూనుకొని, ఎలాంటి కష్ట నష్టాలు ఎదురైనా లెక్క చేయకుండా ఇండియాకు 'స్వయం పర్యాప్తత' (self-sufficiency) సాధించాలి అన్న దీక్షతో కృషి సాగించింది.

చిన్నతనం నుంచే శ్రీ ఘనశ్యామ్ దాస్ ప్రజా వ్యవహారాలలో చురుకుగా పాల్గొంటూ వచ్చారు. ఆనాటి జాతీయ నాయకు లందరూ ఆయనకు సుపరిచితులే! ద. ఆఫ్రికా నుంచి తిరిగి వచ్చిన నాటినుంచే గాంధీజీతో శ్రీ బిర్లాకు ఏర్పడిన అనుబంధం 1948 జనవరి 30 న న్యూఢిల్లీలోని బిర్లా భవనంలో గాంధీజీ హత్య చేయబడిన రోజు దాకా నిరాఘాటంగా కొనసాగింది.

1930 లో ఆయన ఇండియన్ లెజిస్లేటివ్ అసెంబ్లీ సభ్యులుగా ఉన్నారు. 'ఇంపీరియల్ ప్రిఫరెన్స్' కు సంబంధించిన శాసనం చేసినందుకు నిరసనగా తమ అసెంబ్లీ సభ్యత్వానికి బిర్లా రాజీనామా ఇచ్చారు. 1920 ప్రాంతంలో భారతీయ పరిశ్రమల సంరక్షణలో వివక్షణ విధానాన్ని సిఫార్సు చేసిన 'ది ఇండియన్ ఫిస్కల్ కమీషన్' లో బిర్లా ఒక సభ్యుడు. 1936-37 వ సం. రంలో జరిగిన ఇండో - బ్రిటిష్ వాణిజ్య సంప్రదింపుల సందర్భంలో ఇండియా ప్రభుత్వానికి అనధికార సలహాదారుగా ఆయన పని చేశారు.

శ్రీ ఘనశ్యామ్ దాస్ బహుగ్రంథ పరిచయం గలవారు. అర్థశాస్త్రం, మతాలు, చరిత్ర మొదలైన వివిధ విషయాలలోనూ, ఇంగ్లీషు, సంస్కృతం మొదలైన వివిధ భాషల లోనూ ఆయన కూలంకష మైన పాండిత్యం గడించారు. హిందీలోనూ, ఇంగ్లీషులోనూ స్వయంగా పుస్తకాలు

## ఇండియాలో సినిమా థియేటర్‌లు



1983 మార్చి 31 నాటికి ఇండియాలో సినిమాహాళ్ళ సంఖ్య 11,682. యునెస్కో నిర్ణయించిన దేశంలోని ప్రతి 100 మందికీ 2 సీట్ల కనీసపు స్థాయి అందుకోవాలంటే 1985 నాటికి మరో 6,750 థియేటర్‌లను దేశంలో నిర్మించవలసి ఉంటుంది.

ప్రాశారు. 'రూపాయీ కీ కహానీ' (రూపాయి కథ), 'ఇన్ ది షేడో ఆఫ్ ది మహాత్మా' (మహాత్ముని నీడలో), 'ది పాత్ టు ప్రోస్పరిటీ' (ఐశ్వర్యానికి రాచబాట) వంటి ఆయన రచనలు జనాదరణ పొందాయి.

1957 లో భారత రాష్ట్రపతి ఆయనను 'పద్మ విభూషణ' బిరుదాంకితులను చేశారు. 1967 లో బెనారస్ హిందూ విశ్వవిద్యాలయం ఆయనకు 'డాక్టర్ ఆఫ్ లాస్' గౌరవ పట్టా ఇచ్చి సత్కరించింది.

తన జన్మస్థలం అయిన 'పిలనీ'లో 'బిర్లా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ అండ్ సైన్స్' అనే సంస్థను ఆయన స్థాపించారు. ఆయన స్థాపించిన 'బిర్లా ఎడ్యుకేషన్ ట్రస్ట్' మన దేశంలో ప్రస్తుతం 30,000 మంది విద్యార్థులకు ఆర్థిక సహాయం అందజేస్తూంది. చేతికి ఎముకలేని దాతగా ప్రసిద్ధిగన్న బిర్లా దేశంలో వివిధ ప్రాంతాలలో దేవాలయాలు నిర్మించారు. లలిత కళలకూ, సాహిత్యానికీ, సైన్సుకూ పోషకులుగా ఉన్నారు. అనేక విద్యా, సాంస్కృతిక సంస్థలూ, ఆసుపత్రులూ, నర్సింగ్ హోమ్‌లూ, ఒక గ్రహచలన ప్రదర్శిని (planetarium) ఆయన నెలకొల్పారు.

89 ఏళ్ళ వృద్ధాప్యంలో కూడా బిర్లా చలాకీగానూ, ఉత్సాహంగానూ కనిపించేవారు. పరిశ్రమలు పెరిగిన కొద్దీ భూమి మీద ఒత్తిడి తగ్గి, ముమ్మరపు సేద్యానికీ (intensive agriculture), అధికోత్పత్తికీ అది దారితీయగలదని ఆయన దృఢంగా నమ్మేవారు.

(31 వ పేజీ తరువాయి)

వ్యక్తిగా మారాలి!

వ్యక్తిని ఆదర్శవాదిగా మార్చేది అతని శీలం, సహించి, ప్రేమించి అందరినీ ఆలింగనం చేసుకునే అతని విశాల హృదయం. శీలవంతునికి ఏ పనిని ఒప్పగించినా అతడు దానికి న్యాయం చేకూరుస్తాడు. రత్నం ఎక్కడ ఉన్నా రాణిస్తుంది. వెలుగులు చిమ్ముతుంది.

"మంచి అన్నది పెంచుమన్నా!
పూని ఏదైనాను ఒక మేల్ కూర్చి
జనులకు చూపుమన్నా!'

ఇదే ప్రతి ఆదర్శవాదికీ లక్ష్యం కావాలి!

## మాట్లాడే కారు



కారులో బ్రేకులు సరి చేయవలసి ఉన్నా, గాస్ అయిపోవస్తున్నా, ఇంకా అలాంటి అవసరం ఏది వచ్చినా మనుష్య స్వరంతో హెచ్చరించే కారును బ్రిటిష్ లేలండ్ తయారుచేసింది. నికొలస్ మెకంజీ అనే నటీమణి రికార్డుచేసిన 32 మాటలతో కూడిన ఒక టేప్‌ను ఆ కారు తాలూకు డాష్ బోర్డులో అమర్చారు.

"స్వర్గం తొలగించలేని దుఃఖం అంటూ ప్రపంచంలో ఏదీ లేదు!" —మూర్

# కలం స్నేహితులు

(మీ పేరు, వయస్సు, చిరునామా, హాబీలు ఈ శీర్షిక క్రింద ప్రచురించ బడా లంటే తగిన వివరాలతో సహా రూ. 3 లు మనియార్డరు ద్వారా పంపండి —సంపాదకుడు.)

1. సి. జయశంకర బాబు, 14 సం. లు, 9 వ తరగతి, S/o పి. ఓబులేసు, 7/48 భాగ్యనగర్, గుంతకల్లు - 515 801.
పుస్తక పఠనం, సంఘసేవ.

2. ఎస్. గోపాలరావు, 30 సం. లు, గోశీల వీధి, బెర్హంపూర్ - 760 001, గంజాం జిల్లా (ఒరిస్సా).
పాటలు పాడడం, సినీమాలు చూడడం.

3. పి రాయల్, 18 సం లు, బి. కామ్ మొదటి సంవత్సరం, S/o విశ్వనాథ రాజు, C/o పి. వెంకట్రామరాజు, ర్యాలి - 533 236, కొత్తపేట తాలూకా, తూర్పు గోదావరి జిల్లా
కలం స్నేహం, రేడియో వినడం, ఫొటోగ్రఫీ.

4. పి. రమేష్, 18 సం.లు, ఇంటర్ రెండవ సంవత్సరం. S/o సుబ్బరాజు, C/o పి. కామేశ్వర రాజు, ర్యాలి - 533 236, కొత్తపేట తాలూకా, తూర్పు గోదావరి జిల్లా.
కలం స్నేహం, ఆటలాడడం, సినీమాలు చూడడం.

5. పి.వి.కె రాయప రాజు, 17 సం. లు, ఇంటర్ ఆఖరి సంవత్సరం, S/o రాజమ్ రాజు (దత్తుడు), ర్యాలి - 533 236 కొత్తపేట తాలూకా, తూర్పు గోదావరి జిల్లా.
కలం స్నేహం, స్టాంపుల సేకరణ, కవిత్వం.

## పెద్దసైజు ఇండియన్ కొండచిలువ



రాత్రిపూట వేటాడే విష రహిత మైన ఇండియన్ కొండచిలువ ఊపిరి తిత్తులు బల మైనవి. తన వేటను తన శరీరాన్ని చుట్టుచు కోడం ద్వారా నలిపివేసి అది జీర్ణించు కుంటుంది. చిన్న లేడిపిల్లను అది గుటుక్కున మ్రింగివేయగలదు. మిక్కిలి పెద్దసైజు ఇండియన్ కొండచిలువ దాదాపు 8 మీటర్ల పొడవూ, 100 కిలోల బరువూ ఉంటుంది.

"పెరుగుట విరుగుట కొరకే!" - వేమన

6. గిరిసెల విశ్వనాథ్, బి.ఏ మొదటి సంవత్సరం, ఇం. నెం. 9-1-137, పాత పేట, ఉరవకొండ, అనంతపురం జిల్లా - 515 812.

సంఘసేవ చేయడం, వార్తాపత్రికలు చదవడం, క్రికెట్ కామెంటరీ వినడం.

7. పి. సైమన్ రావు, 19 సం. లు, బి. యస్‌సి మొదటి సంవత్సరం, దేవారపల్లి, విశాఖ జిల్లా - 531 030.

ప్రకృతి పరిశీలన, స్నేహం చేయడం, ఆట లాడడం.

8. జైన శ్రీనివాస్, 17 సం. లు, S/o జైన విశ్వనాథం, ముదిమాణిక్య గ్రామం, (వయా) తోటపల్లి, కరీంనగర్ జిల్లా.

రచనలు చేయడం, చదవడం, కలం స్నేహం.

9. జె. వినయ కుమార్, ఇం. నెం. 9-11, సీతారామ పురము, మిరియాల గూడ- 508 207.

ఫొటోగ్రఫీ, కలం స్నేహం.

10. కె. సత్యనారాయణ, 16 సం. లు, S/o రాములు, శనిగరము, కరీంనగర్ జిల్లా - 505 473.

డ్రాయింగ్ గీయడం, ఎక్సర్‌సైజ్ చేయడం, పుస్తకాలు చదవడం.

11. కె. రాధ, 25 సం. లు, C/o ఆర్. బాలపుల్లయ్య, ఎమ్.ఏ, హిందీ పండితుడు, గవర్నమెంట్ జూనియర్ కాలేజి, రాయచోటి - 516 269, కడప జిల్లా.

సాహిత్య పఠనం, సంగీతం, స్టాంపుల, నాణెముల సేకరణ.

12. అబ్బిరెడ్డి సూర్యప్రసాద్, 14 సం. లు, 9 వ తరగతి విద్యార్థి, S/o సూర్య మోహన్ రావు, అనంతవరం-533 222.

స్టాంపులు సేకరించడం, రచయిత కావాలని ఆకాంక్ష, పుస్తకాలు చదవడం.

13. అమిదాల సూర్యప్రకాశ రావు, 35 సం. లు, C/o స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైద్రాబాద్, ఉప్పల్, హైద్రాబాద్-500 039.

ప్రయాణాలు చేయడం, సంగీతం, పెయింటింగ్ చేయడం.

14. అంకం సత్యప్రసాద్, 25 సం.లు. క్లాత్ మర్చెంట్, బండారు లంక - 533 221. అమలాపురం తాలూకా, తూ.గో. జిల్లా.

రచనలు చేయడం. డ్రామాలు వే (వ్రా) యడం, సాహిత్య పఠనం.

15. పి. రమణ, 17 సం. లు, సీనియర్ ఇంటర్ విద్యార్థి, S/o పి. అప్పల నాయుడు, ఆఫీస్ ఆఫ్ ది అసిస్టెంట్ డివిజనల్ ఇంజనీర్, ఎ.పి.ఎస్.ఇ.బి., ఆపరేషన్ సర్కిల్, చీరాల - 523 155, ప్రకాశం జిల్లా.

పత్రికలు చదవడం, క్రికెట్ ఆడడం, కలం స్నేహం.

## కొడైకెనాల్‌లో కనిష్ఠ ఉష్ణోగ్రత

తమిళనాడులోని అందమైన 'పర్వతాగ్ర నగరం' (hill station) కొడైకెనాల్‌లో వాతావరణ శాస్త్రజ్ఞులు లెక్కలు సేకరించడం మొదలు పెట్టిన గత 100 ఏళ్ళలో ఎన్నడూ ఎరుగనంత కనిష్ఠ ఉష్ణోగ్రత 1983 జనవరి 28 న రికార్డు అయింది. గత రాత్రి ఉన్న 10° (సెంటిగ్రేడ్) నుంచి ఆ రాత్రి ఉష్ణోగ్రత ఒక్కసారిగా 2.4° (సెంటిగ్రేడ్) కి పడిపోయింది.

"స్వర్గం అంటే - దేవుడితో సామ్యాన్ని పొందడం!" —కన్‌ఫ్యూషియస్

# కార్టూనులు గీయటం ఎలా?

టి. వెంకటరావు

## 29

## దూర, సామీప్య చిత్రణ









వాస్తవిక ధోరణిలో వస్తువులను చిత్రించడానికి గత కాలంలోని ఆరితేరిన చిత్రకారులు 'దూర, సామీప్య చిత్రణ' (perspective) సూత్రాలు కొన్ని రూపొందించారు. సూక్ష్మంగా అయినా వాటిని తెలుసుకోడం అవసరం. 'పెర్‌స్పెక్టివ్' అంటే వస్తువులనూ, దృశ్యాలనూ వాటి మందం, ఆకారం,

### రష్యన్ డబ్బింగ్

'తన్నీర్, తన్నీర్...' అనే తమిళ ఫిలిమ్‌ను రష్యన్ భాషలో డబ్బింగ్ చేయడానికి రష్యాలోని 'మాస్ ఫిల్మ్ స్టూడియో'లో చురుకుగా సన్నాహాలు జరుగుతున్నాయి.

---

"చిత్ర పటాలు గోడవేపు తిప్పిపెట్టడం వల్ల
చరిత్ర గతిని మనం మార్చలేము!" —జవహర్లాల్ నెహ్రూ

దూర, సామీప్యాలూ సూచిస్తూ చిత్రించే నేర్పు. మనం కార్టూన్‌లు గీసే కాగితం రెండు పరిమాణాలు (dimensions)— పొడవు, వెడల్పు - మాత్రమే కలది. దాని మీద మూడు పరిమాణాలు — పొడుగు, వెడల్పు, మందం — గల వస్తువులను చిత్రించవలసి ఉంది. ఈ మూడు పరిమాణాల భ్రాంతిని కలిగించా లంటే మనం 'దూర, సామీప్య చిత్రణ' సూత్రాలను విధిగా పాటించాలి. అప్పుడే మనం సహజంగానూ, వాస్తవంగానూ కనిపించేట్టు చిత్రాలను గీయ గలుగుతాం.

## పైనుంచి కనిపించే దృశ్యం:

ప్రకృతిలో ఒకే సైజు వస్తువు లైనా వేరు వేరు దూరాలలో ఉన్నప్పుడు వేరు వేరు సైజులుగా మనకు కనిపిస్తాయి. దగ్గిర వస్తువుల కంటె దూరపు వస్తువులు చిన్నవిగా కనిపిస్తాయి. సైజులలో అలా కనిపించే తేడాలను మనం గుర్తించాలి.

పై చిత్రాలు చూడండి. పెద్దగా ఉన్నవి మనకు దగ్గరలో ఉన్నట్టూ, చిన్నవిగా ఉన్నవి దూరంగా ఉన్నట్టూ కనిపించడం లేదూ?

## వాతావరణ ప్రభావం:

మనం చూసే ప్రకృతి దృశ్యాలలో దగ్గిరగా ఉన్న వస్తువులు సహజమైన రంగులలోనూ, దూరంగా ఉన్నవి తేలికగా బూడిద రంగుగా ఉన్నట్టూ కనిపిస్తాయి. వాటి సహజమైన వర్ణాలు స్పష్టంగా మనకు కనిపించవు. దీనికి కారణం మనకూ, దూరంగా ఉన్న ఆ వస్తువులకూ మధ్యలో గాలిలోని ధూళికణాలు ఒక తెరగా ఏర్పడుతూ ఉండడం. అందుకే వాటి రంగులు తేలిపోయి డల్‌గా కనిపిస్తాయి. దగ్గర వస్తువులను నదురుగా కనిపించే ఒత్తు రంగులలోనూ, దూరపు వస్తువులను తేలిక రంగులలోనూ చిత్రించడం ఎంతో అవసరం.

(సశేషం)

---

# ధైర్యం ఎక్కడ నుంచి వస్తుంది?



"ధైర్యంగా ప్రవర్తించడానికి ప్రత్యేక లక్షణాలు ఏమీ అక్కరలేదు. ఎప్పుడో ఒకప్పుడు అందరికీ అవకాశాలు వస్తాయి. వెనుక ధైర్యం ప్రదర్శించిన వ్యక్తుల కథలు మనకు బోధించగలవు, ఉత్తేజ పరచగలవు. అంతే గాని అవే మనకు ధైర్యాన్ని ఇవ్వలేవు. అందుకు - ప్రతి మనిషీ తన ఆత్మలోకి తాను చూసుకోవాలి."

—జాన్. ఎఫ్. కెన్నెడీ.

"ఆరోగ్యం దేహ సంబంధి కాదు: మనస్సుకి సంబంధించింది."

—ఎం.

# వారిని గురించి తెలుసుకోండి

జవహర్‌లాల్ నెహ్రూ (1889-1964): ఆధునిక యుగ భారతీయ మహా పురుషులలో ఒకరు. అలహాబాద్‌లోని ఒక ఆదర్శప్రాయమైన కుటుంబంలో జన్మించి, హారో, కేంబ్రిడ్జ్, లండన్‌లలో విద్యాభ్యాసం చేసిన



నెహ్రూ భారత స్వాతంత్ర్య సంగ్రామంలో ప్రధాన పాత్ర నిర్వహించారు. స్వతంత్ర భారత ప్రథమ ప్రధానిగా మన జాతి భవితవ్యానికి పునాదులు వేశారు. 'ఆత్మ కథ', 'డిస్కవరీ ఆఫ్ ఇండియా', 'గ్లింప్సెస్ ఆఫ్ వరల్డ్ హిస్టరీ' లాంటి ఉద్ గ్రంథాలు ఎన్నో వ్రాశారు.

ఆల్బర్ట్ ష్వైట్జర్ (1875-1965): గొప్ప మత తత్త్వవేత్త, సంగీత శాస్త్రజ్ఞుడు, వైద్య సేవా కార్యకర్త. ఆఫ్రికా - భూమధ్య రేఖ ప్రాంతంలో ఫ్రెంచ్ కాలనీలో 'ఓగోవే' నది తీరాన గల లాంబరీన్ వద్ద ఆయన ఒక ఆసుపత్రి నెలకొల్పి వేలాది ఆఫ్రికన్ రోగులకు ఉచితంగా వైద్య సహాయం అందజేశారు. 1952 శాంతి నోబెల్ బహుమతిని ఆయన అందుకున్నారు.

* * *

బల్‌రాజ్ సహానీ (1913-73): భారతీయ చలన చిత్రాకాశంలో మెరపిన ఒక ఉజ్జ్వల తార. వాణిజ్య దృష్టి అనే కబంధ

---

## సహనానికి మరో పేరు హిందూ మతం!

"హిందూమతం ఇతర మతాల లాగ ఒక ప్రత్యేకమైన మతం కాదు. ప్రపంచంలోని ప్రవక్త లందరికీ దానిలో స్థానం ఉంది. ప్రచారం కోసం ప్రయత్నించే 'మిషనరీ' రకం మతం కా దది. ఎన్నో ఆదిమ జాతుల మతాలను అది తనలో కలుపుకుంది. ప్రతి వ్యక్తీ తన ఇష్టానుసారం, తన ధర్మానికి అనుగుణంగా భగవంతుణ్ణి అర్చించుకుంటూ ఇతర మతాల వారితో శాంతి సామరస్యాలతో జీవించ మని హిందూమతం బోధిస్తూంది."

—గాంధీజీ

"ఆరోగ్యమే మహా భాగ్యం!" -ఎమర్సన్

హస్త్రాల నుంచి భారతీయ రంగస్థలాన్నీ, చలన చిత్ర పరిశ్రమనీ కాపాడిన కొద్ది మంది ప్రముఖులలో ఒకరు. రంగస్థలం మీద ఆయన పోషించిన మరపురాని పాత్ర 'ఆఖ్‌రీ షామా' అనే నాటకంలో మీర్జా గాలిబ్ పాత్ర. ఆయన నటించిన సుప్రసిద్ధ చిత్రాలలో కొన్ని: 'దో బిఘా జమీన్', 'కాబూలీ వాలా'. 'హమ్ లోగ్', 'గరమ్ హవా'.

* * *

ఓ.పి. మెహరా: ఎయిర్ చీఫ్ మార్షల్ ఓ.పి. మెహరా రాజస్థాన్ గవర్నరు; మాజీ విమాన సేనాని; మొత్తం 4,000 పై చిలుకు గంటలు విమానాలను నడిపిన గొప్ప పైలట్. బెంగుళూరులోని 'హిందూస్థాన్ ఏరోనాటిక్స్ లిమిటెడ్' ఛైర్మన్‌గా ఆయన చేసిన అపూర్వమైన సేవ రాజకీయ, వృత్తి రంగాలలో ప్రముఖుల ప్రశంసల నందింది.

* * *

అశోక్ కుమార్: ప్రముఖ హిందీ చలన చిత్ర నటుడు, హోమియోపతీ వైద్యుడు, చదరంగం ఆటగాడు, సాముద్రికుడు, బహు గ్రంథ పఠిత. 200 పై చిలుకు చిత్రాలలో నటించాడు. ఆయన నటించిన చిత్రం 'విక్టోరియా - నెం. 203' విశేష జనాదరణ పొందింది.

* * *

నీలం సంజీవ రెడ్డి: మాజీ భారత రాష్ట్రపతి. స్వాతంత్ర్యోద్యమ కాలంలో పలు మార్లు జైలు శిక్ష అనుభవించారు. ఆం.ప్ర. ముఖ్యమంత్రిగా, భారత జాతీయ కాంగ్రెసు అధ్యక్షులుగా, కేంద్రంలో 'ఉక్కు-గనులు', 'రవాణా', 'విమానయానం' శాఖల మంత్రిగా, లోకసభ స్పీకర్‌గా బహు ముఖాలుగా దేశ సేవ చేసిన మహనీయుడు.

## ఇండియాకు 'పాప్ కారన్' తెచ్చింది ఎవరో తెలుసా?



రెండో ప్రపంచ యుద్ధం ఆరంభం కాబోయే ముందు హిట్లర్ పాలనలో ఉన్న నాజీ జర్మనీ నుంచి గెర్హార్ట్ మార్టిన్ జాకొబీ హోటళ్ళ నిర్వహణ నిమిత్తం ఇండియాకు వచ్చాడు. యుద్ధం ఆరంభం కాగానే అతణ్ణి అరెస్టు చేసి లాహోర్ ఫోర్ట్‌లో బంధించారు. ఇండియాకు స్వరాజ్యం వచ్చిన తరువాత అతడు సకుటుంబంగా కెనడా వెళ్ళి, మళ్ళీ కొద్ది కాలానికే స్పెషల్ రకం జొన్న విత్తనాలతో ఇండియా తిరిగి వచ్చాడు. ఆ జొన్నలతో పేలాలు చేసి 'పాప్‌కారన్' వ్యాపారం ప్రారంభించాడు ప్రస్తుతం బెంగుళూరులో స్థిరపడిన జాకొబీ అక్కడ పాప్‌కారన్ మెషీన్‌లు తయారు చేస్తున్నాడు.

('జర్మన్ ఫీచర్స్' సౌజన్యంతో)

"శత్రువుల మీది మన ద్వేషం మన సుఖానికి చేసేటంత హానిని వారి సుఖానికి కలిగించలేదు." —జె. పెటిట్ సెన్

# ప్రసిద్ధ శాస్త్రజ్ఞులు

## ఇర్వింగ్ లాంగ్‌మ్యూర్

విద్యుద్దీపాల క్రింద ఖర్చయ్యే విద్యుచ్ఛక్తిని బాగా కలపి వచ్చేట్టు చేసి, తద్వారా ఈ నాడు ప్రపంచంలో జను లందరికీ తమ ఎలెక్ట్రిక్ బిల్లులలో ఏటా లక్షలాది రూపాయలు



లాభం చేస్తున్న మహోపకారి సుప్రసిద్ధ అమెరికన్ రసాయన శాస్త్రవేత్త ఇర్వింగ్ లాంగ్‌మ్యూర్. ఎలెక్ట్రిక్ బల్బులలో ఆయన కొత్త మార్పులు ప్రవేశపెట్టడానికి ముందు ఒక్కొక్క బల్బు కొన్ని గంటల పాటు మాత్రమే వెలిగి మాడిపోయేది. విద్యుచ్ఛక్తి విపరీతంగా ఖర్చయ్యేది. ఎక్కువ కాలం మన్నుతూ, తక్కువ విద్యుచ్ఛక్తిని వాడుకునే గ్యాస్‌తో నింపిన టంగ్‌స్టన్ బల్బును లాంగ్‌మ్యూర్ కనుగొన్నారు.

1881 జనవరి 31న బ్రూక్లిన్ (అమెరికా) లో లాంగ్‌మ్యూర్ జన్మించారు. తన 6వ ఏటి నుంచే సైన్సు అంటే ఆయనకు ప్రాణం. 9వ ఏట తనకు ఒక వర్క్‌షాప్ ఏర్పరచుకున్నాడు. 14వ ఏట 'కాల్క్యులస్' పుస్తకం ఒకటి ఆయన కంట పడింది వారాలలోనే ఆ సబ్జక్ట్‌లో ఆయన ప్రావీణ్యం సాధించాడు.

---

### భావ పరిచయ పోటీ
(ఫిబ్రవరి 1984)



"లేనివాడు చేస్తే తప్పు—
ఉన్నవాడు చేస్తే ఒప్పు!"
—గుర్రం ప్రభాకర రావు, ప్రొద్దుటూరు.

* * *

"మరేనండి! ....
ఇది భారతదేశం గదండి!!"
—ఎమ్. రాజశేఖర రావు, అనంతపురం.

"ఇంకోణ్ణి ద్వేషించేటంత అధోగతికి నేను దిగజారలేను." —బి. టి. వాషింగ్టన్

కొలంబియా విశ్వవిద్యాలయంలోని 'స్కూల్ ఆఫ్ మైన్స్'లో చదివి లాంగ్ మ్యూర్ 1903 లో 'మెటలర్జికల్ ఇంజనీరింగ్'లో గ్రాడ్యుయేట్ అయారు. అనంతరం గోటింగెన్ విశ్వవిద్యాలయంలో ఫిజికల్ కెమిస్ట్రీ (భౌతిక రసాయన శాస్త్రం)లో పరిశోధన సాగించడానికి ఆయన జర్మనీ వెళ్లాడు. 1906 లో అక్కడ ఆయన పి.హెచ్‌డి పట్టా పొంది, ఆ తరువాత 'స్టీవెన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ' లో కొద్ది కాలం పాటు రసాయన శాస్త్రం బోధించారు.

1909 లో జనరల్ ఎలెక్ట్రిక్ కంపెనీ వాలూకు న్యూయార్క్ లేబొరేటరీలో లాంగ్ మ్యూర్ మొదట తాత్కాలికంగా చేరాడు. కాని అక్కడి పరిశోధనలు ఆయనకు చాలా ఆసక్తి కలిగించడంతో మరో 42 ఏళ్ళ పాటు ఆ సంస్థనే ఆయన అంటిపెట్టుకొని ఉన్నాడు.

ఆ రోజుల్లో ఎలెక్ట్రిక్ బల్బులలో 'ఫిలమెంట్' క్రింద కార్బన్ బదులు 'టంగ్‌స్టన్' వాడేవారు. కొన్ని గంటలలోనే అవి మాడిపోయేవి. పైగా కరెంట్‌ను ఎక్కువగా కాల్చేవి. బల్బులో ఉండే వాయు పదార్థాలను పూర్తిగా తీసేస్తే పరిస్థితి చక్కబడవచ్చునని జనరల్ ఎలెక్ట్రిక్ కంపెనీలోని ఇంజనీర్లు భావించారు. లాంగ్‌మ్యూర్ మరో విధంగా ఆలోచించాడు. అత్యధిక ఉష్ణోగ్రతల వద్ద పరమాణువులు (atoms), అణువులు (molecules) ఎలా ప్రవర్తించేదీ పరిశీలించా లనుకున్నాడు. ఆక్సిజన్‌తోనూ, కార్బన్ మోనాక్సైడ్‌తోనూ, ఇంకా ఇతర వాయు పదార్థాలతోనూ క్రమంగా బల్బును పూరించి చూశాడు. నత్రజనితో పూరించినప్పుడు శూన్యంలో కంటె అలా నత్రజనిని నింపిన బల్బులో ఫిలమెంట్ ఎక్కువ కాలం వెలగడం గమనించాడు. టంగ్‌స్టన్ పరమాణువులు ఆవిరి అయి నత్రజని కణాలకు తగిలి మళ్ళీ ఎగిరి వచ్చి ఆ ఫిలమెంట్

## 50,000 మంది పనిచేసే అంతర్జాతీయ ట్రేడ్ సెంటర్



న్యూయార్క్‌లోని 'లోవర్ మన్‌హటన్' లో కేవలం 2 ఎకరాల స్థలంలో పక్కపక్కన నిర్మించిన రెండు మిక్కిలి ఎత్తైన సౌధాలలో 50,000 మంది పనివారు పని చెయ్యడానికీ, రోజూ 80,000 మంది విజిటర్లు రావడానికీ వీలుంది. 209 అ. ల చదరం పునాది మీద 110 అంతస్తులతో నిర్మించిన ఈ సౌధాల కోసం 12 లక్షల ఘ. గజాల మట్టిని త్రవ్వి తీసి ప్రక్కనున్న హడ్సన్ నదీ తీరంలో పేర్చగా అక్కడ 23.5 ఎకరాల స్థలం క్రొత్తగా ఏర్పడింది.

"తనను భయపెట్టినందుకు పిరికివారు చూపే కపి ద్వేషం!" —బెర్నార్డ్ షా

మీద వాలసాగాయి. అదే సరిగ్గా ఆయనకు కావలసింది.

1912 లో నత్రజనితో (ఆ తరువాత నత్రజనికి బదులు ఆర్గన్ వాయువు ఆయన వాడారు) నింపిన బల్బ్‌ను-వెనుకటి శూన్యంతో కూడిన బల్బ్ కంటె నూటికి నూరు పాళ్ళు మంచి ఫలితాలు ఇచ్చే దానిని - రూపొందించారు.

బల్బ్‌ల మీద పరిశోధనలు సాగించే రోజులలో ఆయన ఉదజని (hydrogen) తో కూడా ప్రయోగాలు చేశారు. అత్యధిక ఉష్ణోగ్రత ఉదజనిని పరమాణువులుగా విడిపోయేట్టు చేస్తుం దనీ, అవి తిరిగి కలుసుకున్నప్పుడు ఎక్కువ వేడిమి, ప్రకాశం ఉత్పత్తి అవుతా యనీ కనుగొన్నారు. ఈ అంశాన్ని ఆధారంగా చేసుకునే 'అటమిక్ హైడ్రొజన్ వెల్డింగ్ టార్చ్' ఆయన రూపొందించారు. కరిగించే ఉష్ణోగ్రత వద్ద లోహాలను ఒక దానితో ఒకటి అతకడానికి ఈ టార్చ్ ఉపయోగపడుతుంది.

ఈ ప్రయోగాలలో మరో సంగతి కూడా లాంగ్‌మ్యూర్ కనుగొన్నారు. ఉదజనితో నింపిన బల్బ్ వెలగగానే దానిలోని ఉదజని పల్చబడుతుంది. ఇందుకు కారణం వేడిగా ఉన్న టంగ్‌స్టన్ ఫిలమెంట్ ఉదజనిని పరమాణువులుగా విడదీసినప్పుడు, ఆ పరమాణువులు కొన్ని పైన ఉన్న గ్లాస్ మీద సన్నని ఒకే పరమాణువు మందం గల పొరగా ఏర్పడుతున్నాయి. ఈ అంశాన్ని ఉపయోగించుకొని లాంగ్‌మ్యూర్ గాజుఫలకాల ఉపరి భాగాన అటువంటి పొర కల్పించి 'పారదర్శకం కాని గాజు ఫలకాలను' (invisible glass) తయారు చేశాడు. మానవ శరీరంలో ఎంజైమ్‌లూ, వైటమిన్‌లూ, హార్మోన్‌లూ మొదలైనవి శరీరావయవాల లోపలి గోడల మీద ఇలాంటి సన్నని పొరలుగా వ్యాపిస్తాయని ప్రకటించి, శరీర శాస్త్రవేత్తలకు పరిశోధన రంగంలో మరొక క్రొత్త పుంత తెరిచారు.

లాంగ్‌మ్యూర్ కనిపెట్టిన శూన్యంతో కూడిన మెర్క్యురీ లాంప్ వల్లనే నేడు రేడియోలలో వాడే ప్రసారాల ట్యూబ్, ఇంకా ఎన్నో ఎలెక్ట్రానిక్ పరికరాలూ సృష్టించడం సాధ్యం అయింది.

## మిక్కిలి పెద్ద గడియారం



ఎగువ బవేరియా (ప. జర్మనీ)లోని ఒక సరోవరం తీరాన ఉన్న ఒక సత్రం మేనేజరు తాలూకు 100 ఏళ్ళ నాటి ఈ గడియారమే ప్రపంచంలో మిక్కిలి పెద్ద గడియారం అంటున్నారు. టైమ్ తెలిపేందుకు ఈ గడియారంలో 14 ముఖాలు ఉన్నాయి. ఆ 14 ముఖాలలోనూ 4 ముఖాలు బెర్లిన్, వియెన్నా, మ్యూనిక్, పారిస్ నగరాలలోని కాలాలను తెలుపుతాయి.

"అనిష్టత కంటె ద్వేషం ఎక్కువ కాలం నిలుస్తుంది." —హిట్లర్

ప్రథమ ప్రపంచ సంగ్రామ కాలంలో అమెరికన్ నౌకాదళం కోసం లాంగ్‌మ్యూర్ జలాంతర్గామి ఉనికిని గుర్తించే పరికరం ఒకటి రూపొందించాడు. రెండవ ప్రపంచ యుద్ధంలో మిలిటరీ 'స్మోక్ స్క్రీన్'లు తయారుచేసే పరికరాన్ని కనిపెట్టాడు.

పరమాణువులలోని ఎలెక్ట్రాన్‌ల సంఖ్యను, ఉనికిని బట్టి వస్తువుల రాసాయనిక చర్యల స్వభావాన్ని గుర్తించే సూత్రాన్ని కూడా లాంగ్‌మ్యూర్ కనుగొని, ఆ విషయమై శాస్త్రీయ రంగంలో ఉన్న అవ్యవస్థ (అనిశ్చిత స్థితి)ను తొలగించారు.

ప్రాతిపదిక రసాయన శాస్త్ర రంగంలో లాంగ్‌మ్యూర్ చేసిన కృషికి గుర్తింపుగా 1932 లో కెమిస్ట్రీలో నోబెల్ బహుమానం ఆయనకు ఇచ్చారు. ద్వితీయ ప్రపంచ సంగ్రామ కాలంలో లాంగ్ మ్యూర్ కృత్రిమంగా వర్షం కురిపించ వచ్చునని కనుగొన్నారు. ఒక ప్రత్యేక తరహా మబ్బు మీద సిల్వర్ అయొడైడ్ చిలకడం వల్ల కృత్రిమంగా వర్షం గాని, మంచును గాని కురిపించ వచ్చును. 1949 లో మెక్సికోలో జరిపిన ఒక ప్రయోగంలో ఆయన 13 40 డాలర్ల ఖరీదు చేసే సిల్వర్ అయొడైడ్‌తో 32 వందల కోట్ల గాలన్ల నీటిని వర్షింపజేశారు.

లాంగ్‌మ్యూర్ మిక్కిలి నిరాడంబరుడు. ప్రతి విషయంలోనూ అధికాసక్తి ప్రదర్శించే స్వభావం గలవాడు. ఒక వస్తువు ఒక విధంగానే ఎందుకు ప్రవర్తిస్తుందో అన్వేషించడంలోనే ఆయన జీవితం అంతా గడిచిపోయింది. 'తెలుసుకోవాలి' అని పట్టుదలతో కృషి చేసి, తెలిసికొన్న ఆ అంశాలను మానవ జాతికి ఉపయోగపడే విధంగా ఆయన వినియోగించారు.

భార్య మేరియన్ మెర్సిరోతో ఆయన జీవితం ప్రశాంతంగా గడిచింది. పర్వతారోహణం, పడవ పందేలూ, స్కైయింగ్ వంటివి ఆయనకు ఇష్టం.

లాంగ్‌మ్యూర్ 1957 లో పరమపదించారు.

---

## బాటింగ్‌లో అమరనాథ్ ప్రతిభ



130 రోజులలో 1,000 పరుగులు చేసిన క్రికెట్ ఆటగాళ్ళలో మొహిందర్ అమర్‌నాథ్ ప్రపంచంలో 4 వ వాడు. ఇండియాలో గవాస్కర్ తరువాత ఆ ఘనత సాధించిన వాడు అతడే: 10 టెస్ట్ ఆటలలో అతడు 1,012 పరుగులు చేశాడు. పాకిస్థాన్‌తో ఆడిన 6 టెస్ట్‌లలో 584 పరుగులూ, వెస్ట్ ఇండీస్‌తో ఆడిన 4 టెస్ట్‌లలో 428 పరుగులూ ఆయన చేశాడు. సునీల్ గవాస్కర్ 6 టెస్ట్‌లలో 78 రోజులలోనే 1,014 పరుగులు సాధించాడు.

"ప్రేమలో లాగే ద్వేషంలోనూ సబబు ఉండదు."

(16 వ పేజీ తరువాయి)

1931 జనవరిలో ఎలాంటి షరతులూ లేకుండా గాంధీని విడుదల చేశారు. ఆ ఆగస్టు నెలలో కాంగ్రెస్ తాలూకు ఏకైక ప్రతినిధిగా లండన్‌లో జరిగిన రెండవ రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్‌కు ఆయన హాజరయ్యారు. అది ఎంత చలిదేశమైనా స్వయంగా వడికిన నూలుతో నేసిన ఒక ఖద్దరు అంగవస్త్రం,



మరణానికి ముందు గాంధీ

పైన ఒక శాలువా, కళ్ళకు కళ్ళజోడూ, కాళ్ళకు సాదా చెప్పులూ మాత్రమే ధరించి గాంధీ ఆ కాన్ఫరెన్స్‌కు వెళ్ళారు. హరిజనుల ప్రాతినిధ్యం విషయమై గాంధీ ప్రకటించిన అభిప్రాయాలు అప్పటి బ్రిటిష్ ప్రధాని రామ్సే మేక్డొనాల్డ్‌కు రుచించక పోవడంతో వట్టి చేతులతోనే ఆయన ఇండియా తిరిగి రావలసి వచ్చింది.

సత్యాగ్రహోద్యమాన్ని తిరిగి ప్రారంభించడానికి కాంగ్రెస్ ఆయనకు సర్వాధికారాలూ ఇచ్చింది. భారీ ఎత్తున మళ్ళీ ఉద్యమం ప్రారంభం అయింది. బొంబాయిలో ఆయనను అరెస్ట్ చేసి విచారణ లేకుండా ఎరవాడ జైలుకు పంపారు. హరిజనులకు ప్రత్యేక నియోజక వర్గాలు ఏర్పాటు చేసిన బ్రిటిష్ చర్యకు నిరసనగా జైల్లో గాంధీ ఆ మరణాంత ఉపవాస వ్రతం ప్రారంభించారు! తరువాత హరిజనులకు సమాన హక్కులు ఇస్తూ 'ఎరవాడ సంధి' కుదరడంతో విశ్వకవి రవీంద్రనాథ ఠాకూర్ సమక్షంలో గాంధీ ఆ ఉపవాస వ్రతం విరమించారు.

రెండో ప్రపంచ యుద్ధం విషయంలో భారతీయులకు భావస్వాతంత్ర్యాన్ని నిరాకరించినందుకు నిరసనగా 1940 అక్టోబర్‌లో గాంధీ వ్యక్తి సత్యాగ్రహోద్యమం ప్రారంభించారు. ఒక్క ఏడాదిలో 23,000 మంది స్వచ్ఛందంగా జైళ్ళకు వెళ్ళారు. 1942 ఆగస్టులో బొంబాయిలో జరిగిన ఆలిండియా కాంగ్రెస్

---

## 4 గంటల్లో గృహ నిర్మాణం

అలాస్కా [అమెరికా] లోని పాల్మేర్‌లో 288 మంది పనివారు కలసి 2 పడక గదులు గల ఒక ఇంటిని రికార్డు సమయంలో గం. 3 ల, ని. 53 ల, సె. 59.40 ల కాలంలో తయారు చేశారు. 1982 లో కాలిఫోర్నియాలో నెలకొల్పబడిన వెనుకటి రికార్డు కన్న ఇది ని. 25 లు తక్కువ అని తెలుస్తూంది.

"త్వర త్వరగా నేను పనులు చేస్తున్నా ఎప్పుడూ నేను తొందరపడను!" —జె. వెస్లీ

కమిటీలో గాంధీ 'క్విట్ ఇండియా' ('ఇండియా వదలి పొండి!') తీర్మానాన్ని ప్రతిపాదించారు. ఇతర కాంగ్రెస్ నాయకు లందరితో పాటూ గాంధీనీ, కస్తూరీ బానూ కూడా అరెస్ట్ చేసి, వా రిద్దరినీ పూనా సమీపాన ఉన్న ఆగాఖాన్ భవనంలో బంధించారు. దేశంలో తీవ్రమైన విప్లవం చెలరేగింది. జైలుకు వెళ్ళే ముందు గాంధీజీ దేశ ప్రజలకు "కరేంగే యా మరేంగే!" (Do or die) అనే సందేశం ఇచ్చారు.

60 ఏళ్ళ పాటు ఆయనకు సహధర్మచారిణి అయిన కస్తూరీ బాయి తన 74 వ ఏట 1944 ఫిబ్రవరి 22 న ఆగాఖాన్ భవనంలో డిటెన్షన్‌లోనే కన్ను మూసింది. మే 6 న బ్రిటిష్ ప్రభుత్వం ఆరోగ్య కారణాల వల్ల గాంధీని విడుదల చేసింది. అదే ఆయన చివరి కారాగార వాసం. జీవితంలో మొత్తం 2,338 రోజులు గాంధీజీ జైలులో గడిపారు.

సెప్టెంబరు నెలలో గాంధీజీ హిందూ, ముస్లిం విభేదాల పరిష్కారానికి ముస్లింలీగ్ అధ్యక్షులు ఖ్వాయిదే అజామ్ జిన్నాను కలుసుకున్నారు. తన ప్రత్యేక 'పాకిస్తాన్' వినా దాన్ని వదులుకోడానికి జిన్నా సమ్మతించనందువల్ల ఆ చర్చలు విఫలం అయాయి.

భారత దేశ స్వాతంత్ర్యం విషయమై చివరి బ్రిటిష్ రాజ ప్రతినిధులు వేవెల్, మౌంట్ బాటెన్‌లతో జవహర్లాల్ నెహ్రూ జరిపిన చర్చలలో గాంధీజీ ఆయనకు ఉపదేశకులుగా ఉన్నారు. హిందూ, ముస్లిమ్ విద్వేషాలను తగ్గించడం కోసం తూ.బెంగాల్, బీహార్ రాష్ట్రాలలో ఆయన పర్యటించారు.

భారత దేశం ఇండియా, పాకిస్తాన్‌లుగా విభక్తమై స్వాతంత్ర్యం పొందిన 1947 అగస్టు 15 న గాంధీ ఉపవాసం చేసి కలకత్తాలో విజృంభించిన మత కలహాల నివారణకు దైవ ప్రార్థనలు జరిపారు. సెప్టెంబరు నెలలో మత కలహాలను నివారించడానికి, కాందిశీకుల క్యాంపులను దర్శించడానికి గాంధీ ఢిల్లీ పరిసర ప్రాంతాలలో పర్యటించారు.

1948 ఆరంభంలో స్వతంత్ర భారతంలో

---

## పక్షుల ఆసుపత్రి



ఢిల్లీలోని దిగంబర జైన్ టెంపుల్ ట్రస్ట్ వారు నడుపుతున్న పక్షుల ఆసుపత్రిలో పక్షులను పెంచే వారు తీసుకొని వచ్చే జబ్బు చేసిన, లేదా దెబ్బ తిన్న పక్షులకు వైద్యం చేస్తున్నారు. 1924 లో జైన సన్యాసులు స్థాపించిన ఈ అపూర్వమైన ఆసుపత్రి కేవలం పక్షుల మేత క్రిందే ఏటా ఒక లక్ష రూపాయలు ఖర్చు చేస్తూంది. చికిత్స నిమిత్తం ఇక్కడకు వచ్చే పక్షులలో పావురాలు, చిలుకలు, పిచ్చుకలు, బాతులు, కోడి పెట్టలు ముఖ్యమైనవి. పశు, పక్షి వైద్య నిపుణులు శ్రద్ధగా ఇక్కడ వాటికి చికిత్స చేస్తున్నారు.

"సుఖ జీవనానికి మనశ్శాంతి ప్రధానం!" — టి. సిసిరో

మత విద్వేషాలు అంతరించి శాంతి నెలకొనా లని 5 రోజుల పాటు మళ్ళీ ఆయన ఉపవాసం చేశారు. 1948 జనవరి 30 న న్యూ ఢిల్లీలోని బిర్లా మందిరంలో నాథూరామ్ వినాయక్ గాడ్సే తుపాకి గుండుకి ఎర అయి, 'రామ్! రామ్!' అంటూ గాంధీజీ తుది శ్వాస వది లారు. ఆయన హత్యా వార్త విని యావత్ ప్రపంచం నిర్ఘాంత పోయింది.

తన 78 వ ఏట ఆ విధంగా పరమపదిం చిన గాంధీజీ అంతిమ యాత్ర ఊరేగింపులో లక్షలాది మంది ప్రజలు పాల్గొన్నారు. పవిత్ర యమునా నదీ తీరాన జనవరి 31 సాయంత్రం 4 గం.లకు ఆయన భౌతిక కాయాన్ని చంద నపు కట్టెల చితి మీద చేర్చి అంత్యక్రియలు జరిపారు. గౌతమ బుద్ధుని తరువాత మళ్ళీ అంతటి మహనీయుడైన మహాత్మా గాంధీ జీవితంలో చివరి అంకం ఆ విధంగా ముగి సింది.

భగవ దర్పితం అయిన మానవుని ఆత్మ శక్తి ముందు ప్రచండ మారణాయుధాల శక్తి కూడా కొరగా దని ప్రపంచానికి చాటిన ప్రవక్త గాంధీ మహాత్ముడు! ప్రపంచం అంతా ఆయనకు నివాళులు పట్టింది. సుప్రసిద్ధ శాస్త్రవేత్త ఐన్‌స్టైన్ మాటలలో చెప్పా లంటే - 'ఒక వెయ్యేళ్ళు పోయిన తరువాత ఇలాంటి మహాత్ముడు నిజంగా ఈ భూమి మీద జీవించాడా?' అని ప్రజలు ఆశ్చర్య పడుతారు!

(12 వ పేజీ తరువాయి)

1945 లో దాసుగారి మనుమడికి మశూ చికం పోసింది. ఒక రోజు బాధకు తట్టుకోలేక గిలగిల కొట్టుకుంటున్న పిల్లవాణ్ణి చూసి దాసు గారు "ఆ బాధ నేను అనుభవిస్తాను. వాణ్ణి చల్లగా చూడు ప్రభూ!" అని భగవంతుణ్ణి ప్రార్థించారట. మరుక్షణం దాసుగారికి మశూ చికం పోయడం, పిల్లవాడికి నయం కావడం జరిగింది. ఆ వ్యాధితోనే దాసుగారు 1945 జనవరి 2 న హరినామ స్మరణం చేస్తూ ప్రశాంతంగా ప్రాణాలు వదిలారు.

త్యాగరాజుతో సమాను డని భక్తి ప్రపత్తు లతో తెలుగు వారు శ్రీ నారాయణ దాసును స్మరిస్తారు. ఏటేటా భద్రాచలంలో జరిగే వాగ్గేయకార వర్ధంతిలో ఆయనను సంస్మ రిస్తున్నారు.

ఆచార్య యస్వీ జోగారావు వ్రాసిన 'శృంగార సర్వజ్ఞము' అనే దాసుగారి జీవిత చరిత్ర కావ్యంలో దాసుగారు ఇలా అంటారు:

"పురుషోత్తము వలలో పడి
పురుషత నే నాడొ కోలుపోతిని, నే నా
హరి కొలువు వర్తకిని - నా
అరిమురి ఈ ఆట పాట లా హరి
కొరకే!"

నిజంగా పురుషోత్తముని కొలువుకే జీవి తాన్ని అంకితం చేసుకున్న ధన్యజీవి శ్రీ ఆది భట్ల నారాయణదాసు గారు!

"'సుఖంగా ఉన్నానా?' అన్న ఆలోచన వచ్చిన మరుక్షణం
మంచే సుఖం దూరం అవుతుంది." —జె. ఎస్. మిల్

# వనితా లోకం

## కళ్ళ అందం కాపాడుకోండి!

శ్రీమతి పర్వేష్ హండా

ఎక్కువ అలసట, నరాల దౌర్బల్యం, ఆందోళన, అలజడి వయస్సు పైబడక ముందే కళ్ళ క్రింద ముడతలు ఏర్పడేట్టు




చేస్తాయి. కళ్ళక్రింది చర్మం ఒక్కటే మానవ దేహంలో స్వేదగ్రంథులు (moisture glands) లేని భాగం. వార్ధక్య లక్షణాలు మొట్టమొదట ఇక్కడే కనిపిస్తాయి. కళ్ళక్రింద ముడతలు ఏర్పడకుండా నిరోధించడానికి, ఏర్పడితే తొలగించడానికి 'లానోలైన్' కలపిన క్రీమ్‌ను వాడవచ్చును. దోసకాయ రసంలో రోజ్‌వాటర్ కలిపి ఉపయోగిస్తే కళ్ళక్రింద నల్లని మచ్చలు ఏర్పడకుండా నిరోధించవచ్చు. రోజూ రెండుసార్లు ఆ రసంలో ముంచిన గుడ్డను కళ్ళమీద ఉంచుకోండి. క్రీమ్ వాడేటప్పుడు కనురెప్పలమీద నుంచి క్రిందికి రాయడం సరియైన పద్ధతి.

కళ్ళు మిలమిల్లాడుతూ ఆరోగ్యంగా కనిపించేట్టు చేసే సరళమైన అభ్యాసాలు కొన్ని ఉన్నాయి:

1. కళ్ళు మూసుకుని ఒకటీ, రెండూ అని లెక్కించి, కళ్ళు తెరచి, మళ్ళీ ఒకటీ రెండూ అని లెక్కిస్తూ ఇలా 20 సార్లు చెయ్యండి.

(మిగతా 56 వ పేజీలో)

## ఇండియాలో 'ఎక్స్‌ప్రెస్' మోటార్ రోడ్లు

ప. జర్మనీలోని 'ఆటోబాన్'ల, ఉ. అమెరికా లోని 'ఫ్రీ వే'ల నమూనాలో 4 కార్లు ఏకకాలంలో ప్రక్క-ప్రక్కన పయనించగల ఎక్స్‌ప్రెస్ మోటార్‌రోడ్లను నిర్మించే పథకాన్ని ఇండియా చేబట్టబోతూంది. ఇందుకు ముందుగా 'అహమ్మదాబాద్ — బరోడా' రోడ్‌నూ, 'కలకత్తా - దుర్గాపూర్' రోడ్‌నూ ఎంచుకున్నారు.

"తల నెరవడం వయస్సుకు చిహ్నం; వివేకానికి కాదు" —గ్రీక్ సామెత

# పోటీలు

ఏప్రిల్ 1984

'విస్డమ్' పోటీలలో ఎవరైనా పాల్గొన వచ్చు. ఏ ఎంట్రీ కా ఎంట్రీ విడిగా పావు తావు సైజుకు తగ్గని కాగితం మీద వ్రాయాలి. ప్రతి ఎంట్రీమీదా అడ్రస్సు ఉండాలి. ఒకే కాగితం మీద ఒకటి కంటె ఎక్కువ ఎంట్రీలు వ్రాస్తే పరిశీలించబడవు. సరియైన, లేదా మేలైన ఎంట్రీలు చాలా ఉంటే లాటరీ పద్ధతిలో ఎన్నికైన ముగ్గురు విజేతలకు రు. 10 లు, రు. 7 లు, రు. 5 లు ఖరీదు చేసే పుస్తకాలు బహుమతులుగా పంపబడును. విజేతల ఎన్నికలో సంపాదకునిదే తుది నిర్ణయం. ఎంట్రీలకు 'పోటీ కూపన్' (ఒక ఎంట్రీకి చాలు) అంటించి పంపాలి. ఒక కూపన్‌తో ఒకేసారి ఎన్ని ఎంట్రీ లయినా పంపవచ్చును. ఎంట్రీలు అందవలసిన ఆఖరు తేదీ: ఏప్రిల్ 20, 1984. పంపవలసిన చిరునామా: పోటీల నిర్వాహకుడు, తెలుగు "విస్డమ్", 9, దేశికా రోడ్డు, మైలాపూరు, మద్రాసు - 600 004.

—సంపాదకుడు.

## వ్యాసం

'మత సామరస్యం' అనే అంశం మీద 300 మాటలకు మించకుండా వ్యాసం వ్రాసి పంపండి.

## ప్రశంసకు గల ప్రేరక శక్తి



మనుష్యులు ఇంకా ఇంకా మంచి ఫలితాలు సాధించేట్టు చెయ్యాలంటే వారి పొరపాట్లూ, లోపాలూ ఎత్తి చూపడం గాక వారి నైపుణిని ప్రశంసిస్తూ ఉండడం చాలా అవసరం. మేనేజర్‌గా నీవు ప్రతి రోజూ వారిని పొగడక పోయినా వారి పని నీకు చాలా సంతృప్తికరంగా ఉన్నదని ఏదో విధంగా వారికి సూచిస్తూ ఉండాలి. ప్రశంస కలిగించే ఆనందాన్ని వారు చవిచూస్తే మరింతగా ప్రశంస అందడానికి వారు ప్రయత్నిస్తారు. ప్రశంసే - విమర్శ కాదు - అన్ని రంగాలలోనూ కార్యసాధకమైన గొప్ప పరికరం!

"స్త్రీకి జుట్టు ఎంత పొడుగ్గా ఉంటే అంత అందం!" —న్యూ టెస్టమెంట్

## క్విజ్

1. తండ్రి, తాతల నుంచి సంక్రమించిన ఆస్తిని ఏమంటారు? 2. అమెరికా సంయుక్త రాష్ట్రాలలో వాడుకలో ఉన్న కరెన్సీ ఏది? 3. ఉల్లంఘించరానిది ఏది? 4. రవిశాస్త్రి ఏ ఆటకు చెందిన క్రీడాకారుడు? 5. భారతదేశ చరిత్రలో 1947కు గల ప్రాధాన్యం ఏమిటి? 6. ఎర్రకోట (లాల్ ఖిల్లా) ఏ నగరంలో ఉంది? 7. 'ప్రూడెన్షియల్ కప్' ఏ ఆటకు చెందింది? 8. టెన్నిస్ ఆటలో 'డ్యూస్' అంటే ఏమిటి?

## పజిల్



ఆధారాలు - అడ్డం: 1. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి, 3. గణపతి, 5. ప్రయత్నము లేనిది, 7. ముఖాన్ని వికృతంగా చేసే ఒక రాగం, 8. '—లిఖితం' ఎవరు తప్పించుకో గలరు? 9. పిరికివారుగ, 10. శ్రీ కృష్ణుని రాజధాని, 11. ఆడరూపంలో వచ్చి మురిపించే దెయ్యం, 13. రాక్షసి పన్నిన మాయ, 16. కృష్ణాజిల్లాలోని పవిత్రమైన ఊరు, 17. సంస్కృతంలో బియ్యం—బహువచనం.

నిలువు: 1. సర్వేంద్రియాలలోనూ ప్రధాన మైంది, 2. తలక్రిందులు చేసే ప్రయత్నం, 3. మిక్కిలి సూక్ష్మ, 4. 'కాలి కట్' అసలు పేరు, 5. శత్రువులకు భయం కలిగించే, 6. కర్రలాగ ఉండే కూరగాయ, 10. 22వ సంస్కృతంలో అనండి; 12. హారతులు, 14. గజిబిజి అయిన టక్కరు, 15. మందంగా వీచే గాలి.

## తెలివికి పరీక్ష

1. 'చెరకు....', '.... మంచి' ఒకే

---

## మగువ ప్రాణం తీసిన టి. వి. వ్యామోహం

మద్రాసు వాల్‌టాక్స్ రోడ్‌లో మూడో అంతస్తులో కాపురం ఉంటున్న డ్రైవరు బాబు భార్య లక్ష్మి [వయస్సు 20 ఏళ్లు] పిట్ట గోడ మీదుగా ముందుకు వంగి రెండో అంతస్తులో ఉన్న స్నేహితురాల్ని "టీ.వీ.లో 'ఒళియుమ్, ఒళియుమ్' [తమిళ సినిమాల లోని నాట్య దృశ్యాలు] కార్యక్రమం ఆరంభ మైందా?" అని అడుగుతూ బ్యాలెన్స్ తప్పి ముందుకు పడిపోయింది. తలకు బలమైన గాయాలు తగిలి అనంతరం జనరల్ ఆసుపత్రిలో మరణించింది.

"మనిషి మలచిన దెయ్యి దివ్య మహిమ గలది" —జె. ఎడిసన్

రెండక్షరాల మాటతో రెండు పదాలూ పూరించండి, 2. 148 (110) 368: 243 ( ) 397 బ్రాకెట్లలోని సంఖ్యను పూరించండి, 3. నృపాలుడు ( ) చంద్రుడు—బ్రాకెట్లకు రెండు వైపుల ఉన్న మాటల అర్థాన్నీ బోధించే ఒకే పదంతో బ్రాకెట్లను పూరించండి, 4. అత్రి, వశిష్ఠుడు, పరీక్షిత్తు, జాబాలి, భరద్వాజుడు—ఈ సముదాయంలో ఇముడని వ్యక్తిని గుర్తించండి. 5. పురుషుల కంటె స్త్రీలకు సిగ్గు ఎక్కువ-నిజమా? కాదా? 6. అన్నిటికీ వర్తించే పేరు ఏది? 7. 'ర్మ్' వచ్చే కవి పేరు చెప్పగలరా? 8. నరు దేమో అనిపించే జంతు వేది?

## మాటల మహిమ

ఈ క్రింది మాటలకు సరియైన అర్థాన్ని/ అర్థాలను గుర్తించండి:

1. అండజం: (ఏ) బ్రహ్మాండం, (బి) పక్షి, (సి) భూమి, (డి) పాము.

2. అంతరాయం: (ఏ) అంతరాళం, (బి) రోదసి, (సి) విఘ్నం, (డి) పైరాబడి.

3 అంతర్వత్ని: (ఏ) గర్భిణీ స్త్రీ, (బి) సవత్ని, (సి) సవతి, (డి) చూలాలు.

4. అంతేవాసి: (ఏ) చివర ఉన్నవాడు, (బి) శిష్యుడు, (సి) స్వల్ప భేదం, (డి) సమీపస్థుడు.

5. అంధస్సు: (ఏ) చీకటి, (బి) అన్నం, (సి) అమృతం, (డి) చంద్రుడు.

6. అంబకం: (ఏ) అంబలి, (బి) పినతల్లి, (సి) కన్ను, (డి) బాణం.

7. అంబరం: (ఏ) పరుష, (బి) ఆకాశం, (సి) వస్త్రం, (డి) కన్ను.

8. అంబారి: (ఏ) ఏనుగుమీది పీఠం, (బి) అమ్మకు శత్రువు, (సి) నరకాసురుడు, (డి) పూజారి.

## విస్డమ్
### పోటీల కూపను
### ఏప్రిల్ 1984

## ముఖచిత్ర వ్యాఖ్య

ఆరు మాటలకు మించకుండా ఈ సంచిక ముఖచిత్రానికి తగిన శీర్షిక వ్రాసి పంపండి.

## ఏమారైతే?
(ఫిబ్రవరి 1984)



(మీ ఆవిడతో మీకు సరిపడకపోతే?)

"అలా అనకండి బాబూ!
అసలే పిల్లలు కలవాడిని!!"
—హెచ్. పార్థసారథి, రాజమండ్రి.

* * *

"అబ్బ! సిగ్గేస్తూంది - నేను చెప్పను."
—తాటిపర్తి బాలకృష్ణారెడ్డి, కోటపాడు.

* * *

"ష్! మా ఆవిడ వింటుంది ..."
—గజవెళ్ళి రమాపతి, హనుమకొండ.

"నైతిక శిక్షణ అందరికీ కావల్సిందే-దానికి వయస్సుతోటీ, పుట్టి పెరిగిన వాతావరణంతోటీ సంబంధం లేదు" —గాంధీజీ

## పాఠకుల అభిప్రా...

దైనందిన జీవితంలో మీకు ఎదురయ్యే ఏ సంఘటనను గురించి అయినా ఒకటి రెండు వాక్యాల్లో చమత్కారమైన వ్యాఖ్య వ్రాసి పంపండి. ఉత్తమ వ్యాఖ్యకు రు. 5 లు ఖరీదు చేసే పుస్తకం బహుమతి!

(52 వ పేజీ తరువాయి)

2. తలపైకెత్తి 20 సార్లు అతి వేగంగా కళ్లార్పడం చెయ్యండి. కొంచెం విశ్రాంతి తీసుకుని తలక్రిందికి వంచి మళ్ళీ 20 సార్లు వేగంగా కళ్లార్పండి. కళ్ళకు చెమ్మను చేకూర్చేందుకు ఈ అభ్యాసం ఉపయోగిస్తుంది.

3. కనుగ్రుడ్లను సప్రదక్షిణంగా (ఎడమ నుంచి కుడికి) 20 సార్లూ, అప్రదక్షిణంగా (కుడినుంచి ఎడమకు) 20 సార్లూ త్రిప్పండి. కొంచెం విశ్రాంతి తీసుకుని మళ్ళీ 10 సార్లు అలా చెయ్యండి.

4. కళ్ళు అరచేతులతో మూసుకుని కొన్ని నిముషాలు ఆ చీకటిలోకి చూస్తూ ఉండండి. దీనివల్ల కళ్ళ అలసట తగ్గుతుంది.

5. మోచేతులు మేజా బల్లమీద ఆన్చి అరచేతులతో కళ్ళు మూసుకోండి. తల ముందుకు మేజా బల్లమీదకు వాల్చండి. తల బరువు అరచేతులమీద ఆనుస్తూ మెడలోని కండరాలకు పూర్తి విశ్రాంతి ఇస్తూ, అలా 5 నిముషాలు ఉండండి!

('హార్వ్యాసా రివ్యూ' సౌజన్యంతో)

## మీరైతే.....?

"విస్డమ్ పత్రికకు ఎడిటర్ అయితే?" మీరైతే ఏం చేస్తారు? క్లుప్తంగా, చమత్కారంగా ఉండే జవాబు వ్రాయండి.

## భావపరిచయ పోటీ



8 మాటలకు మించకుండా పైన కని పిస్తున్న రెండు చిత్రాలనూ పరిశీలించి వాటికి వర్తించేట్టు చమత్కారమైన లేదా ఆలోచన రేకెత్తించే శీర్షికను సూచించండి.

"ఆగ్రహం ఒక విధమైన ఉన్మాదం - తత్ఫలితంగా ఎన్నో మంచి పనులు ధ్వంస మవుతున్నాయి" —గాంధీజీ

# హింస లేకుండా సౌందర్యపోషణ

డయానా రత్నాగర్

“హింస లేకుండా సౌందర్య పోషణ” ఒక అంతర్జాతీయ ఉద్యమం. రైట్ ఆనరబుల్ మ్యూరియెల్, లేడీ డౌడింగ్ బ్రిటన్‌లో 1959 లో ఈ పేరుతో ఒక ధర్మాదాయ సంస్థ (charitable trust) ను స్థాపించారు. ఈ సంస్థకు ప్రపంచంలోని అన్ని దేశాలలోనూ శాఖ లున్నాయి. 1974 లో ఇండియాలో కూడా ఈ సంస్థ తాలూకు శాఖ వెలసింది.



కార్నియా దెబ్బ తిన్న సీమ కుందేళ్ళ కళ్ళు

ప్రాచీన కాలంలో గౌతమబుద్ధుడు, మహావీరుడు మొదలైన వారు భూత దయను బోధించారు. భారతీయ సంస్కృతిలో 'అహింస' చిరకాలంగా ఒక ప్రధాన సిద్ధాంతంగా ప్రసిద్ధి పొందింది. అయినా - ఈ నాడు మనం వాడుక చేసే సబ్బులూ, షాంపూలూ, క్రీమ్‌లూ, అత్తరులూ మొదలైన సౌందర్య పోషక ద్రవ్యాల తయారీలో అమానుషంగా జంతువులను హింసించడం జరుగుతూందని మనలో చాలా మందికి తెలియదు. సుప్రసిద్ధమైన చాలా కాస్మెటిక్ ద్రవ్యాల ఉత్పత్తి వెనుక నోరు లేని ఎన్నో జీవాల దారుణమైన హింస దాగి ఉంది. కాస్మెటిక్ పదార్థాలను ముందుగా లేబొరేటరీలలో జంతువుల మీద ప్రయోగించి చూస్తారు.

ఈ ప్రయోగాలకు బలి అయి ప్రతి ఏడూ లక్షలాది జంతువులు మరణిస్తున్నాయి. ఉదాహరణకు - కొన్ని కొన్ని 'షాంపూ' లను సీమ కుందేళ్ళ కళ్ళలో వేసి పరీక్షించి చూస్తారు. బాధతో అవి గిలగిల తన్నుకుంటాయి. ఈ ప్రయోగాల ఫలితంగా అవి శాశ్వతంగా గ్రుడ్డివి అయి

## ఎక్కువ ఖర్చుపెట్టి తీసిన సినిమా

ఇంతవరకు ప్రపంచంలో అత్యధిక వ్యయంతో తీసిన సినిమా 'స్టార్ ట్రెక్!' ఈ సినిమా తీయడానికి 4.6 కోట్ల డాలర్లు (సుమారు రూ. 46 కోట్లు) ఖర్చయిందట!

“పరుల కష్టాలతో నేను సానుభూతి చూపగలను; వారి సుఖాలు నాకు బోర్ కొడతాయి!”

—ఆల్డస్ హక్స్‌లీ

పోతాయి. జంతువుల మీది ప్రయోగాలు విజయవంతం అయినా, మనుష్యుల విషయంలో కూడా అవి హానికరాలు కావు అనే గ్యారంటీ ఏమీ లేదు. ఆ సంగతి తెలిసి కూడా జంతువులకు ప్రాణ సంకటంగా తయారైన ఈ ప్రయోగాలను ఇంకా కొనసాగిస్తూనే ఉన్నారు.



జంతు చర్మాల మీద పరీక్ష

ఎలాంటి మరకలూ, లోపాలూ లేకుండా జంతువుల చర్మాలను ఒలిచేందుకు జంతువులను దారుణంగా హింసించి, హింసించి వాటి ప్రాణాలు తీస్తారు. ఈ అంశం ప్రజలలో విరివిగా ప్రచారం చేసి, జంతు చర్మాలను హోదా చిహ్నాలుగా భావించే స్వభావాన్ని ప్రజలలో తగ్గించడానికి "హింస లేకుండా సౌందర్య పోషణ" సంస్థ కృషి చేస్తూంది.

ఈ సంస్థ ఆశయాలలో కొన్ని:

1. జంతువుల పట్ల చూపుతున్న క్రూరత్వాన్ని గూర్చిన వివరాలు సేకరించడం,

2. సౌందర్యం, ఆకర్షణ, కళారాధన అనే సాకుతో జంతువులను ఈ విధంగా హింసించడం అనుచితం అనే భావాన్ని ప్రజలలో విరివిగా ప్రచారం చెయ్యడం,

3. జంతువులను హింసించి తయారు చేసే 'కాస్మెటిక్స్'కు ప్రత్యామ్నాయంగా వేరే 'కాస్మెటిక్స్' తయారు చేసే ప్రక్రియల కోసం పరిశోధనలు సాగించడం,

4. జంతు హింస లేకుండా కాస్మెటిక్స్‌ను ఉత్పత్తి చేసి, వాటిని వాడుకలోకి తేవడం,

5. ఈ పరిశ్రమలలో చట్ట విరుద్ధంగా జంతువుల పట్ల ప్రదర్శిస్తున్న క్రూరత్వాన్ని వీలైనంత వరకూ నిరోధించడం.

'హింస లేకుండా సౌందర్య పోషణ' సంస్థ చేబట్టిన పథకాలలో కొన్ని:

'స్పెర్మ్ వేల్' చేప నూనె స్థానే వాడదగిన జోజోబా గింజల నూనెను విరివిగా ఉత్పత్తి చెయ్యడం ముఖ్యంగా అవసరం.

---

(8 వ పేజీ తరువాయి)

అని అభివర్ణించింది. రసం పిండడానికి గాని, కషాయం కాచడానికి గాని సాధారణంగా మొక్క అంతటినీ వాడుక చేస్తారు.

గనేరియా వ్యాధికీ, మూత్రకోశ వ్యాధులకూ దీని రసం ఒక చెంచాడుగాని, దీని కషాయం ఒక ఔన్సుగాని ఇస్తారు. దీని రసాన్ని, లేదా ఆకులు నూరి చేసే గుజ్జును గాయాల మీదా, పుళ్ళ మీదా వేసి కడతారు. మూల శంక, 'లో మొలల' (fistula) రోగులకు దీని ఆకుల గుజ్జును పాలలో కలిపి ఇస్తారు.

"సుఖం అంటే - తరగని బ్యాంకు అకౌంటూ,
మంచి వంటవాడూ, చక్కని జీర్ణశక్తీ ఉండడం!" -రూసో

అతి క్రూరంగా వేల్ చేపలను చంపి ఈ నూనె తయారు చేస్తూ ఉండడంతో క్రమంగా వేల్ చేపల జాతి అంతరించి పోయే ప్రమాదం ఏర్పడుతూంది. తోళ్ళను పదను చేయడం లోనూ, మిక్కిలి కచ్చితంగా పని చేసే పరి కరాల ఉత్పత్తిలోనూ వేల్ చేప నూనెకు బదులు జొజోబా గింజల నూనెను వాడ వచ్చును. 'హింస లేకుండా సౌందర్య పోషణ' సంస్థ ఈ విత్తనాలను మెక్సికో నుంచీ, అమెరికా నుంచీ తెచ్చి ఇండియా లోని మెరక ప్రాంతాలలో ఈ పంట పండించ వచ్చునేమో అని ప్రయోగాలు చేస్తూంది.

మనం ధరించే పట్టు వస్త్రాలలో ఒక్కొక్క గ్రాము పట్టు తయారవడానికి పట్టు కాయలలోని సుమారు 15 పురుగులను వేడి నీళ్ళలో ఉడికించి దారుణంగా సంహరిం చడం జరుగుతూంది అని గుర్తు వస్తే, నిజా నికి సిల్కు వస్త్రాలు మనకు ఎలాంటి ఆనం దాన్నీ ఇవ్వలేవు. వారణాసిలోని సిల్కు నేత పని వారిని పట్టుకు బదులు పోలియెస్టర్ సిల్కును ఉత్పత్తి చేసుకోండని ఈ సంస్థ ప్రోత్సహిస్తూంది.

ఈ సంస్థ తరపున బొంబాయి విశ్వ విద్యా లయంలోని కెమికల్ టెక్నాలజీ డిపార్టు మెంట్ వాళ్ళు ఏనుగు దంతానికి (ivory) బదులుగా వాడడానికి సరిగ్గా ఏనుగు దంతం లాగే కనిపిస్తూ, అంత దృఢంగానూ ఉండే 'ఐవరీన్' అనే పదార్థాన్ని తయారు చేయడా నికి ప్రయోగాలు జరుపుతూంది. ఏనుగుల నుంచి దంతాలు సేకరించడం కోసం పనస పళ్ళలో విషం కలిపి పెట్టి, వాటిని ఎంత క్రూరంగా వధిస్తున్నారో తెలిస్తే ఏనుగు దంతాలతో చేసిన వస్తువుల మీద మనకు అంత మోజు ఉండదు.

## ఇండియాలో సింహాల సంఖ్య



వెనుకటి రోజులలో ఉత్తరాన శహరాణ్ పూర్, లూధియానా, గుజరాత్‌లోని అహ మ్మదాబాద్, దీశా లాంటి ఎన్నో ప్రదేశా లలో సింహాలు కనిపించేవి. ఇవాళ గుజరాత్ గిర్ వన్య మృగ సంరక్షణ స్థావరంలో తప్ప దేశంలో ఎక్కడా సింహాలు లేవు. 1893 లో గిర్ అడవులలో 31 సింహాలు మాత్రమే ఉండగా జునాగఢ్ నవాబు కృషి ఫలితంగా 1905 నాటికి ఆ సంఖ్య 60 కి పెరిగింది. 1936 లో 287 దాకా పెరి గినా, 1[illegible]4 లో ప్రభుత్వం సేకరించిన లెక్కల ప్రకారం మొత్తం 180 సింహాలు గిర్ స్థావరంలో ఉన్నట్టు తేలింది. కతియ వార్ ద్వీప కల్పంలో గుజరాత్ ప్రభుత్వం మరో సింహ సంరక్షణ స్థావరం నెలకొల్పే ప్రయత్నాలు చేస్తూంది.

"ప్రభూ: మాకు సుఖం చేకూర్చు:
మాలో మంచితనం పెరుగుతుంది:" —ఆర్. క్రాసింగ్

ఇండియాలో షేవింగ్ బ్రష్‌లూ, చిత్ర కారుల బ్రష్‌లూ మొదలైన వాటిని ముంగిస వెంట్రుకలతో గాని, పంది వెంట్రుకలతో గాని తయారు చేస్తున్నారు. అందుకోసం ముంగిసలను చంపుతారు. పంది దేహం నుంచి అది బ్రదికి ఉండగానే నిర్దాక్షిణ్యంగా పటకార్లతో దాని వెంట్రుకలు పీకుతారు.



సీమ కుందేలు కంట్లో షాంపూ వేయడం

నెత్తురు కారుతూ, బాధతో అవి గిలగిల కొట్టుకుంటున్నా వారి గుండె కరుగదు. ఈ బ్రష్‌ల ఉత్పాదకులకు హితబోధ చెయ్యడానికీ, ఆ బ్రష్‌లలో వాడేందుకు సింతెటిక్ వెంట్రుకలు తయారు చెయ్యడానికీ ఈ సంస్థ కృషి చేసూంది.

'చీజ్' (జున్ను) తయారీలో వాడే 'రెన్నెట్' అనే ఒక పదార్థాన్ని ఇంకా మేత పట్టని, రోజుల వయస్సులో ఉన్న చిన్న చిన్న ఆవు దూడల కడుపులో నుంచి గ్రహిస్తారు. అందుకోసం అలాంటి దూడల నెన్నింటినో ఏటేటా నిర్దాక్షిణ్యంగా వధిస్తున్నారు. 'హింస లేకుండా సౌందర్య పోషణ' సంస్థ సూక్ష్మ క్రిముల నుంచి (microbes) తయారు చేసే 'రెన్నెట్' పదార్థం నమూనాలను విదేశాల నుంచి సేకరించింది. ఒక ప్రముఖ డైరీ సంస్థ సహకారంతో కొనసాగించిన ప్రయోగాలు నూటికి నూరు పాళ్ళూ ఫలవంతం అయాయి. 'చీజ్'ను ఉత్పత్తి చేసే ముగ్గురు ప్రముఖ ఇండియన్ ఉత్పాదకులు జున్ను తయారీలో ఇప్పుడు ఈ రెన్నెట్‌ను వాడుక చేస్తున్నారు. తద్వారా అభం శుభం ఎరుగని పసి ఆవు దూడల ప్రాణాల నెన్నింటినో కాపాడిన ట్లవుతూంది.

నిష్కారణమైన, దారుణమైన మృత్యువు నుంచి జంతువులను కాపాడడానికి ఈ సంస్థ కంకణం కట్టుకుంది. 'ది ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ అగ్రికల్చరల్ రీసెర్చ్' (ICAR) రాజస్థాన్‌లోని బికనీర్ వద్ద ఒక గొర్రెల కేంద్రం నిర్వహిస్తూంది. పుట్టిన 48 గం.లలోగా గొర్రె పిల్లల చర్మాలను ఒలిచి ఎగుమతి చెయ్యడానికి ఉద్దేశింపబడిన కేంద్రం

## ఇండియాలో యురేనియమ్ నిలువలు

కేరళలో లభించే మోనాజైట్ నుంచి మొదట 1959 లో యురేనియమ్‌ను రాబట్టారు. మొదటి భారీ ఎత్తు యురేనియమ్ మిల్లు జంషెడ్‌పూర్ సమీపంలో జాదుగోడాలో 1968 నుంచి పని చేస్తూంది. ఇండియాలో యురేనియమ్ నిలువలు 30,000 టన్నుల దాకా ఉన్నట్టు అంచనా!

"ప్రపంచంలో బోలెడు సంపద ఉంది,
అందరం మహారాజుల్లా జీవించవచ్చు!" —ఆర్. ఎల్. స్టీవెన్‌సన్

ఇది. చర్మాల కోసం వధించేందుకు సీమ కుందేళ్ళను (rabbits) పెంచే మరో కేంద్రం 'గార్సా'లో ఉంది. చర్మాలవల్ల ఉపయోగం ఉండే నక్క, తోడేలు, ఉడత మొదలైన ఇతర జంతువుల కోసం కూడా అలాంటి కేంద్రాలను నిర్వహించాలని ICAR ఆలోచిస్తున్నట్టు తెలుస్తోంది. 'హింస లేకుండా సౌందర్య పోషణ' సంస్థ ఈ విధమైన జంతు హింసను నిరసిస్తోంది. నోరూ, వాయీ లేని జంతువుల ప్రాణాలకు భద్రత కల్పిస్తూ జంతువుల పట్ల క్రూరత్వాన్ని నిషేధిస్తూ శాసనం చెయ్యాలని ప్రభుత్వాన్ని అర్థించే మహజర్ మీద ప్రజల సంతకాలు సేకరిస్తోంది.

ఒక ఆదర్శం కోసం పోరాడుతున్న ఈ సంస్థకు ప్రజల అండ దండలు పూర్తిగా అవసరం!

(4 వ పేజీ తరువాయి)

కూడా కొంత ఆనందం ఉన్నా, కావాలని విశ్రాంతిగా నడిచే నడకతో దీనిని పోల్చడానికి వీలు లేదు.

ఒకప్పుడు ఒక వృద్ధుడు తన 85 వ జన్మదినోత్సవం జరుపుకుంటున్నాడు. అతిథులంతా ఆశ్చర్యంగా — "ఇన్నేళ్ళు వచ్చినా ఇంత ఆరోగ్యంగా ఎలా ఉండగలుగుతున్నారు మీరు?" అని అడిగారు. వృద్ధుడు నవ్వుతూ ఇలా అన్నాడు: "నా ఆరోగ్యంలో రహస్యం చెబుతా వినండి. నాకు వివాహం అయి 60 ఏళ్ళు అయింది. వివాహం నాటి రాత్రి మా దంపతులం 'ఒక నియమం చేసుకున్నాం: మాలో అభిప్రా భేదాలు వస్తే, ఎవరిది తప్పని తేలుతుందో వారు బయటికి పోయి కొంత దూరం నడిచి రావాలి అని. నిజం చెప్పాలంటే - ఈ 60 ఏళ్ళూ రోజూ నేను అలా బయట నడుస్తూనే ఉన్నాను."

## వింత నక్షత్రాలు



ఆకాశంలో ఎన్నెన్ని చిత్ర విచిత్రాలైన నక్షత్రాలు ఉన్నాయో మనలో చాలా మందికి తెలియదు. హెర్క్యులీస్ అనే నక్షత్ర పుంజంలోని 'మీరా' అనే నక్షత్రం ఎ పెద్దదంటే మొత్తం మన సౌర కుటుంబాన్నంతా అది తనలో ఇముడ్చుకోగలదు. అయితే మిక్కిలి దూరంగా ఉండడం వల్ల ఎంతో బలమైన టెలిస్కోప్ లోనుంచి చూస్తే మిణుకు మిణుకు మనే చిన్న చుక్కలాగ అది కనిపిస్తుంది. ఒక దాని చుట్టూ ఒకటి తిరుగుతూ 'బాలే' నాట్యం చేసే జంట నక్షత్రాలలో ఒకదాని ఉనికి లెక్కల ప్రకారం నిర్ణయం అయినా, అది మన కంటికి కనిపించదు. రెండోది - సిరియస్ - ఒక్కటే మనకు కనిపిస్తూంది.

"అందరూ సుఖంగా ఉంటే తప్ప ఏ ఒక్కడికీ సంపూర్ణ సుఖం చేకూరదు." - హెచ్. స్పెన్సర్

దేశంలో
అందరికీ ఆరోగ్యం,
అందరికీ విద్య, ఇరవై
అంశాల కార్యక్రమ
సందేశం ఇదే



# పోటీల (ఫలితాలు)

(ఫిబ్రవరి 1984)

వ్యాసం - మొదటి బహుమతి: అంగర కృష్ణారావు, విశాఖపట్టణం-530016; రెండవ బహుమతి: జయ విజయ, సాలూరు; మూడవ బహుమతి: ఎమ్. సునిత్ కుమార్, చిలకలూరి పేట.

క్విజ్ - జవాబులు: 1. భారతీయ విమానదళానికి చెందిన స్క్వాడ్రన్ లీడర్ రాకేష్ శర్మ, 2. ఉ. ఆఫ్రికా ఖండంలో, 3. ద. కొరియాది, 4. అట్లాంటిక్ మహా సముద్రంలో ప. ఇండియా దీవులవద్ద, 5. జవహర్లాల్ నెహ్రూ, 6. వైటమిన్ 'డి', 7. ఎస్.ఎల్. ఖురానా, 8. శ్రీమద్రామానుజాచార్యులు.

విజేతలు - మొదటి బహుమతి: జె. నరేంద్ర బాబు, చర్ల (ఖమ్మం జిల్లా); రెండవ బహుమతి: టి. గిరీష్, కొండూర్ (నిజామాబాద్ జిల్లా); మూడవ బహుమతి: ఎస్. సిద్ధేశ్వర రావు, పర్లాకిమిడి (గంజాం జిల్లా).

పజిల్ - జవాబులు - అడ్డం: 1. భామిని, 4. సత్య సంధుడు, 7. గత కాలము, 8. వ.ము.య., 9. రాహువు, 10. ముసి ముసిన, 13. ముగ్గు, 14. రావా? 16. గతోదకము, 19. పాడవా?, 20. రమణి, 22. నవనీతము, 23. విశా ముఖము, 24. రాముని.

నిలువు: 1. భాగవతము, 2. మితము, 3. నికాయము, 4. సముద్రము, 5. సంగరాన, 6. డు, ము, వు, 11. సిగ్గుతో, 12. సిలుక, 15. వారుణి ముని, 16. గవాక్షము, 17. దవనము, 18. ముర నీరా, 19. పావని, 21. మతము.

## బ్రహ్మపుత్ర వంతెన విశిష్టత



ఇండియాలోని ఉద్ధృతంగా ప్రవహించే పెద్ద నది బ్రహ్మపుత్ర మీద అస్సాంలోని అమీన్‌గాంవ్, పాండు ప్రాంతాలను కలుపుతూ నిర్మించిన బ్రహ్మాండమైన వంతెనకు రూ. 10.6 కోట్లు ఖర్చయింది. 4 ఏళ్ళ పాటు రాత్రింబవళ్ళు పనిచేసి నిర్మించిన ఈ వంతెనకు 1963 జూన్ 7 న నాటి ప్రధాని నెహ్రూ ప్రారంభోత్సవం చేశారు. దీనిలోని విశిష్టత దీని డిజైన్, నిర్మాణం పూర్తిగా భారతీయ పద్ధతిలో జరగడం. 10 ఆర్చీలూ, 2 అంతస్తులూ గల ఈ వంతెన నిర్మాణంలో సుమారు 42 లక్షల ఘ.అ.ల కాంక్రీటూ, 40,000 టన్నుల సిమెంటూ, 14,000 టన్నుల ఉక్కూ వాడడం జరిగింది.

"నీ కుడి చెయ్యి ఏం చేస్తూందో నీ ఎడమ చేతికి తెలియనియ్యకు!" —మాథ్యూ

విజేతలు - మొదటి బహుమతి: వల్లా లక్ష్మీ నరసింహ మూర్తి, కోడూరు (కృష్ణా జిల్లా); రెండవ బహుమతి: ఎస్. అరుణా నంద బ్రహ్మానంద రావు, మిర్యాల గూడ, (నల్గొండ జిల్లా); మూడవ బహుమతి: బొమ్మన విజయ బాబు, జట్ని (ఒరిస్సా).

తెలివికి పరీక్ష - జవాబులు: 1. మంగలికి, 2. బాసుందీ, 3. సి. పి. బ్రౌన్ దొర, 4. 'మర' (పడమర, మరణము), 5. వలువు (ఇది గుర్రానికి సంబంధించింది కాదు), 6. 66 (పర సంఖ్య పూర్వ సంఖ్యకు రెట్టింపు కంటె 2 తక్కువ), 7. 75 (బ్రాకెట్లకు ఇరు వైపు సంఖ్యలను గుణించి 2 తో భాగించాలి), 8. నిజం.

విజేతలు - మొదటి బహుమతి: శ్రీమతి జమునా సుధాకర్, మద్రాసు - 54; రెండవ బహుమతి: స్నానం రామకృష్ణ, గూడూరు; మూడవ బహుమతి: కె. జి. జయరామి రెడ్డి, కర్నూలు.

మాటల మహిమ - జవాబులు: 1. కిరీటం (బి), తలపాగా (డి), 2. వడ్రంగి వాడే ఒక పనిముట్టు (సి), 3. ఒక ధాన్యం (బి), 4. రొమ్ము (సి), వక్షస్థలం (డి), 5. స్త్రీ (బి). 6. వట్టివేరు (ఏ), 7. మనస్సు (సి), హృదయము (డి), 8. గుడ్లగూబ(డి).

విజేతలు - మొదటి బహుమతి: కాట్పల్లి కిషన్ శాస్త్రి, నిర్మల్-504 106; రెండవ బహుమతి: పి. అనిత, హైద్రాబాద్ - 28; మూడవ బహుమతి: యన్. కుమారదేవ రెడ్డి, పూతలపట్టు (చిత్తూరు జిల్లా).

ముఖచిత్ర వ్యాఖ్య - మొదటి బహుమతి: తాళ్ళపల్లి రమేష్, శనిగరము (కరీంనగర్ జిల్లా); రెండవ బహుమతి: ఎమ్. సువిత్ కుమార్, చిలకలూరి పేట; మూడవ బహుమతి: పి. లక్ష్మి, హైద్రాబాద్-28.

పాఠకుల అభిప్రాయాలు - మొదటి బహుమతి: అద్దేపల్లి భరత్‌కుమార్, బాపట్ల-522 101; రెండవ బహుమతి: యక్కల ప్రసాదరావు, ఖమ్మం; మూడవ బహుమతి: కె. అంబేద్కర్, ప్రజ్ఞం (గుంటూరు జిల్లా).

మీరైతే? - మొదటి బహుమతి: హెచ్. పార్థసారథి, రాజమండ్రి; రెండవ బహుమతి: తాటివర్తి బాలకృష్ణా రెడ్డి, కోటపాడు (ప్రకాశం జిల్లా); మూడవ బహుమతి: గజవెల్లి రమాపతి, హనుమకొండ, వరంగల్లు.

భావ పరిచయ పోటీ - మొదటి బహుమతి: గుర్రం ప్రభాకర రావు, ప్రొద్దుటూరు; రెండవ బహుమతి: ఎమ్. రాజశేఖర రావు, అనంతపురం.

---

(7 వ పేజీ తరువాయి)

ప్రసవించిన బిడ్డలు అనీ తెలిపాడు. ఆ మరుసటి రోజు ఉదయాని కల్లా ప్రత్యేక రాజదూతలు వెళ్ళి సీతను కూడా సగౌరవంగా అయోధ్యకు తీసుకువచ్చారు. ఆ విధంగా సీతా రాముల పునస్సమాగమానికి వాల్మీకి మహా కవి వ్రాసిన రామాయణ కావ్యం కారణం అయింది.

ఉదాత్తమైన నీతులకూ, సూక్ష్మమైన దార్శనిక సత్యాలకూ రామాయణం కల్ప వృక్షం వంటిది. శృంగారం మొదలు శాంతం వరకూ తొమ్మిది రసాలూ ఆ కావ్యంలో అద్భుతంగా పోషింప బడ్డాయి. హైందవ నాగరకత, సంస్కృతుల అత్యున్నత మైన ఆదర్శాలను రామాయణం వేనోళ్ళ చాటుతూంది.

